॥ ఓం ॥

"ఆచార్యదేవోభవ"

( వీరశైవ ధర్మ సంస్థాపకులు )

# జగద్గురు పంచాచార్యుల సంక్షిప్త పరిచయము



[illegible] & M.O

ఆంధ్రప్రదేశ వీరశైవ ధర్మ గ్రంథమాల
హైదరాబాదు-500 027. (ఆం. ప్ర.)

ముద్రణ : జూలై 1990

ప్రతులు : 1000

మూల్యము : రూ. 12/-

## అంకితము

"వీరశైవ ధర్మ" పత్రికా పరిచయముతో నేర్పడిన అనుగ్రహము
దినదినాభివృద్ధి గాంచిన పరమపూజ్యులు
శ్రీమత్ కాశీ జ్ఞానసింహాసనాధీశులు శ్రీ॥ జగద్గురు 1008
**శ్రీ శ్రీ శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములు**
జంగమవాడి మఠ, వారాణసి శ్రీ వారి దివ్య చరణారవిందములకు
నా చిఱు పొత్తమును సంస్మరణార్థమునకై భక్తితో
అంకితము గావించుచున్నాము.

చిరునామ
వే. పం॥ రాజవీరదేవర, పెద్దమఠము "తీర్థ" & ఎం. ఓ. ఎల్.,
ఇంటి నెం. 3-3-139, కాచిగూడ,
హైదరాబాదు-500 027. ఆం. ప్ర.



శ్రీ వీరరుద్రముని శివాచార్య మహాస్వాములు
శ్రీరంభాపురి పీఠాధిపతులు



శ్రీ మరుళాచార్య శివాచార్య మహాస్వాములు
శ్రీ ఉజ్జయి పీఠాధిపతులు



శ్రీ శిద్దేశ్వర లింగ శివాచార్య మహాస్వాములు
శ్రీ కేదార పీఠాధిపతులు



శ్రీ ఉమాపతి శివాచార్య మహాస్వాములు
శ్రీశైల పండితారాధ్య పీఠాధిపతులు



శ్రీ డా. చంద్రశేఖర శివాచార్య మహాస్వాములు
శ్రీ కాశీ పీఠాధిపతులు



వెనుకబడిన తరగతిలో జేర్చబడిన వీర మాహేశ్వర (జంగమ) మహాసభా వారి బాలబాలికలకు భోజన వసతులను ఉచితముగా ఆం. ప్ర. ప్రభుత్వము వారు వెంటనే గల్పించాలని కోరుతు మహాసభా పక్షాన వే॥ పం॥ రాచవీర దేవర, సభాధ్యక్షులు. శ్రీ P. M. ప్రభులింగదేవర, సహాయన కార్యదర్శి

శ్రీ M. సిద్దలింగస్వామి వారి చి॥ శ్రీ రామలింగయ్య గార్లు

శ్రీ ఎన్. టి. రామారావు గారిని 1-8-1988 వారింట్లో గల్పిన సందర్భాన దీసిన చిత్రము.



తేది 5 సెప్టెంబరు 1988న గురు పూజోత్సవ సందర్భమున ఆం. ప్ర. ముఖ్యామాత్యులు శ్రీ ఎన్. టి. రామారావు గారు జూబ్లి హాలు, హై. లో వే. పం. శ్రీ రాచవీరదేవర "తీర్థ" & M. O. L. సంస్కృతాంధ్ర సీనియర్ గ్రేడు 1 ఉత్తమ పండితులుగా గుర్తించి సన్మానించి స్టేటు అవార్డు నొసఁగియున్నారు.



## రచయిత తొలిపలుకు

వీరశైవ ధర్మము అతి ప్రాచీన మైనది. ఈ ధర్మ వైశిష్ట్యమును గురించి వేద - ఆగమోపనిషత్తులు పురాణేతిహాసముల నుండి తెలియుచున్న ప్పటికిని దీనిని సరిగ్గా గుర్తించలేకున్నారు. అందుచేత సామాన్య జనులు దీనియొక్క విలువను గుర్తించుటకై నేను "వీరశైవధర్మ గ్రంధమాల" నుండి దీనినొక పరిమళ పుష్పముగాను అథవా బిళ్వదళముగాను వ్రాసి ప్రకటించి యున్నాడను. దీని నామూలాగ్రముగా జదివి వీరశైవ సమాజము వారు ధర్మతత్వములను గ్రహించి ఆచరించుటేగాకుండ వీరశైవధర్మ సాహిత్య రచయితలకు దగు ప్రోత్సాహమునొసఁగగలరని నా మనవి.

## స్వ కీ య ము

ఆంధ్రప్రదేశముననున్న వీరశైవులలో చాలా మందికి మన ధర్మసంస్థాపకులైన పంచాచార్యులయొక్క పరిచయము లేదనిన అతిశయోక్తిగాదు. నేనే స్వయంగా ఒకరిద్దరు వీరశైవులను గురించి మన జగద్గురు లెవరని ప్రశ్నించినప్పుడు వారు "శంకరాచార్యులని" చెప్పిరి. అది నాకుకటువుగా దోచినది. ఏలననగా తననుగన్న తండ్రి నామధేయమునే గుర్తించని తనయుని మనుగడయేల? ఆనాటితో మన వీరశైవ ధర్మసంస్థాపకులైన జగద్గురు పంచాచార్యుల పరిచయమును ఈ ప్రాంతపు వీరశైవులకు గలిగించు నుద్దేశముతో ఆర్థిక ఇబ్బందులను లెక్కజేయకుండ,

ఏదో ఒక కారణమును బురస్కరించుకొని, తొలిసారి కరీంనగరులోని శ్రీమంతులైన శ్రీ రాజేశంగారి కుటుంబమువారికి లింగదీక్షా సంస్కారమును జేయించుటకై శ్రీ లింగమూర్తి వారి గురువులైన శ్రీ బి. స్వామినాథముగారి ప్రార్థనమేరకు నేను స్వయముగా కాశికివెళ్ళి జగద్గురు పూజ్యశ్రీ జ్ఞానసింహాసనాధీశులైన శ్రీ విశ్వేశ్వర శివాచార్యుల వారిని ఆంధ్రప్రదేశమునకు రప్పించి శ్రీవారి పరిచయముజేయించడము జరిగినది. మరోసారి నా షష్ఠిపూర్తి నెపమున జగద్గురు 1008 శ్రీ రంభాపురి వీరసింహాసనాధీశులైన శ్రీ శ్రీ శ్రీ వీరరుద్రముని శివాచార్య మహాస్వాముల వారిని భాగ్యనగరమునకు రప్పించి శ్రీ సన్నిధి వారి పరిచయము గావించడము జరిగినది. ఇప్పుడు తేది 18,19,20 మే 1990 న 5 మంది పంచ పీఠాధిపతులు ఆంధ్రప్రదేశమునకు రాజధాని యైన భాగ్యనగరమునకు ఆంధ్రప్రదేశ వీరశైవ మహాసభవారి ప్రార్థనమేరకు విచ్చేయుచున్నారు. కనుక ఆంధ్రప్రదేశ వీరశైవుల మహా భాగ్యము నేటికి గదా! ఫలించినది. శ్రీ పూజ్య భగవత్పాదులను దర్శించి తత్తీర్థ ప్రసాదములను గ్రోలి తమ జన్మ తరింపజేసికొనగలరని నా మనవి.

* *

## - గ్రంథావిష్కరణము -

పంచపీఠాధీశుల సంక్షిప్త పరిచయమను నీచిఱుపొత్తము తేది 20-5-90న,
జగద్గురు 1008 కాశి జ్ఞాన సింహాసనాధీశులైన
పూజ్య శ్రీ శ్రీ శ్రీ డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాముల వారి పవిత్ర
కరకమలములతో నావిష్కరించియున్నారు.
అందుకు నేనెంతయో వారికి కృతజ్ఞుడను.

*

# దండకము

శ్రీకరంబైన యాంధ్రప్రదేశంబునన్ మధ్యమాణిక్యమున్ బోలి భోనంబున కాధారమైనట్టి జిల్లాకు (మెదక్) తాలూక యందోలనన్ జేవళాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మఠాధీశ్వరత్వంబు గైకొన్న శ్రీ సంగమేశాఖ్య మహేశ్వరుండొప్ప వీరేశగోత్రోద్భవుండై సదాచార సంపన్నశీలుండు, ధీరుండునౌనాతడా శ్రీమతిన్ శివ్వమాంబాఖ్యసాధ్వీ మణిన్ బెండ్లియాడెన్ మహా వైభవోపేతుడై, కొన్ని నాళ్ళిట్లు మహేశ్వరా చారశీలంబులందొప్పుచున్ దానుసంసార నిర్వాహమున్ జేయగా గల్గి రవ్వారికిన్ బుత్ర రత్నంబు లారాచయార్యుండనన్, శంకరాచార్యుండనన్, పంచాక్షరాఖ్యుండనన్, శ్రీ షడక్షర్యభిఖ్యుండనన్, వీరయార్యుండు నానేవురున్ బేర్మివర్ధిల్లగా నందుఁబంచాక్షరీ నాముడైక్యంబు నొందంగ శేషించు నానల్వురన్ జేష్ఠుడౌరాచయాఖ్యుండు రాణించె నింటన్ వహించెన్ స్వసంసార భారంబు, శ్రీ శంకరార్యుండు పాపన్నపేటన్ మఠాధిపుడై యుండి విరాజిల్లగా స్వామియా శ్రీ షడక్షర్యాభిఖ్యుండుతా జోగిపేటన్ స్థితుండై సదాశివ్వపేటన్ మఠాధీశతన్ బూని విరాజిల్లె. వైరాగ్యతేజోవిశేషంబు మన్నించుచున్ భక్తబృందంబు పాదార్చనల్ సేయగా శీలతన్ దక్షతన్ బూజ్యతన్ గ్రాలుచున్ దానధర్మాది సత్కార్యముల్ సల్పు పుణ్యాత్ముడై (గొల్లకొనాముమున్ జెందఁగా) కొల్లగా కీర్తులన్ జెందగా, వీరలన్ జిట్టితమ్ముండు వీరయ్యకున్ జేష్ఠుడౌ బుత్రురాచయ్యమన్ దాన్వపీఠంబునన్ నిల్పెనీరీతి సామాజిక శ్రేయమున్ గోరుచున్ వేడ్కమై లింగ పూజాధురీణుండునై యుండఁగా నంతవాశంకరుండున్ పదామోదకారున్ నిజాధీనమునన్ జేర్చి కైలాసవాసున్ దగన్ జేసెదాన్ ॥

సీ॥ పరమేశుఁజేరెనాభ్రాతయని తలంచి
వగచి వీరయతనభ్రాతృపదవి
కైలాతివారు రాజాలరని గణించి
తనదు పుత్రుని గొనివిల్పెముదమున
వేడ్కనతఁడిట్టులా వీరనుతుఁగూడి
తనదు భక్తులమదుల్ తనియజేసె
బాలుండు ముద్దులౌ పలుకులు వినిపింపఁ
వత్సలతఁ దానతనిఁ బంపెబడికి

తే॥ గీ॥ పిదపఁ దల్లితండ్రి పెద్దకొమరుఁజూచి ।
వెనరుతో యతీశ్వరునకొసంగ ।
నఁతడు స్వీకరించి కుతుకమ్మతోఁబెంచి ।
కారణాలు గరుపిఁజేరేశివుని ॥
యతికి సోదరుఁడైన వీరయ్య యంత ।

తే॥ గీ॥ అన్నదివికేగ బాలునినాదరించు
వారులేరని దాఁదెచ్చి గారవమునఁ ।
బెంచుచుండెను దాకొగిపేటఁజేరి ॥

(కై. వా. శివశ్రీ మఠము సిద్ధవీరయ్య డాకూరు గారి కృతిద్వయము)

తే॥ గీ॥ శ్రీకరుఁడు వీరశైవాబ్ధి శీతకరుఁడు
ప్రథితగుణుఁడు శ్రీ వీరయాహ్వాయ బుధుఁడు
తనదుపుత్రు రాచయకు విద్యలను నేర్పి
యరిగె గైలాసమునకుఁ దానంతమందు ॥

కం॥ శ్రీవీరయాఖ్య సుగుణికి
బేరిమి పుత్రుండు రాచవీరయ కరమున్
గూరిమితోడను విద్యల
నేరిచి పితృభక్తిగల్గి నెగడెడునెప్పుడున్ ॥

V

# (స్వీయకృతులు "శివశ్రీ")

శ్లో॥ మాతామేనాగమాంబాచ
వీరార్యాచపితామమ ।
తయోః జేష్ఠ పుత్రోఽహం
రాచవీరాఖ్య దేవర : ॥

శ్లో॥ సంస్కృతాంధ్రాంగ్లభాషాసు
హిందీ కర్నాటక కేషుచ ।
పంచభాషా ప్రవీణోఽహం
రాచవీరాఖ్య దేవరః ॥

శ్లో॥ ఈశ్వరాఖ్యా మహాసాధ్వి ।
సంగాఖ్యావిదుషీమణి ।
తాభ్యాం ప్రణయ బంధస్తు ।
రాచవీరాఖ్య దేవరః ॥

శ్లో॥ ఏకాభార్యా మహాగుణవతీ, ఈశ్వరాఖ్యా సుశీలా
అన్యాభార్యా గృహకర్మ ధర్మనిరతా, సంగాఖ్యా విదూషీణీ ।
ఉభావేతౌ సహజానురాగ నిరతావే కోదరాజ్ఞాతావివ
ఏతాభ్యాం హృదయైక ప్రాణపతిరహం శ్రీ రాచవీరాఖ్యదేవరః

శ్లో॥ ప్రథమపుత్రోమే, బసవ రాజాఖ్యదేవరః ॥
ద్వితీయోమే, ప్రభులింగాఖ్య దేవరః ॥
తృతీయాపుత్రీమె, శివరాణ్యాఖ్యా సుశీలాహిసా
జనకస్తేషమహం రాచవీరాఖ్య దేవరః ॥

# వీరశైవ ధర్మతత్వసారము

అథవా

# వీరశైవ ధర్మసంస్థాపకులైన పంచాచార్యుల సంక్షిప్త పరిచయము - వీరశైవ ధర్మము

ఈ జగత్తులో వైదిక మతములవారికి వేదములు ఎంతటి ప్రమాణ్యములో ఆగమములు వీరశైవులకంతే ప్రమాణములు, అష్టావింశత్యాగమములలో మతము, కులము, ధర్మము, కర్మము, శిల్పము, వ్యాపారము మొదలగువాటి రహస్య పరిచయమంతయు శివాగమములనుండే నిరూపింపబడినవి. వీరశైవులకు మాత్రము శివాగమములే అత్యంత ప్రమాణములై యున్నవి.

ఈ మతము నాలుగు యుగములలోను తన అస్తిత్వమును గోల్పోకుండ యుండినదని ఆగమ, ఉపనిషత్తు, పురాణములనుండి అవగతమగుచున్నది. ఈ మతము శివాద్వైతము, శక్తి విశిష్టాద్వైతము, ద్వైతాద్వైతము అను పర్యాయ నామములతో ప్రఖ్యాతిగాంచినది.

## జ గ త్సృ ష్టి వి చా ర ము

శ్లో॥ దృశ్యంతే పంచభూతాని, యేచలోకాశ్చతుర్దశ ॥5॥
సముద్రాపర్వతాదేవా, రాక్షసాఋుషయస్తథా ।

దృశ్యంతేయానిచాన్యాని, స్థావరాణిచరాణిచ ॥6॥
గంధర్వాప్రమథానాగా, స్సర్వేతే మద్విభూతయః ।

శివగీతలో (అ. 5 విభూతియోగం) శ్లో॥ 5 నుండి

తా॥ ఏ పంచభూతములు, పదునాలుగు లోకములు, సముద్రములు, పర్వతములు, దేవతలు, రాక్షసులు, ఋషులు, స్థావరములు, జంగమములు, గంధర్వులు, ప్రమథులు, నాగములు ఇంక నేవేవి కనబడుచున్నవో యవి యన్నియు నా విభూతులే !

శ్లో॥ పురాబ్రహ్మాదయో దేవా, ద్రష్టుకామామమాకృతియ్ ॥7॥
మందరం ప్రయయుస్సర్వే, మమప్రియతరంగిరిం ।

స్తుత్వాప్రాంజలయోదేవా, మాంతథా పురతస్థ్సితాః ॥8॥
తాన్దృష్ట్వాథమయాదేవాన్, లీలాకులితచేతసః ।

తేషామపహృతంజ్ఞానం, బ్రహ్మాదీనాందివౌకసామ్ ॥9॥
ఆసంస్తేఽనకృద్జ్ఞానం మామాహుఃకోభవానితి

తా॥ మున్ను బ్రహ్మాదిదేవతలు, నాయాకారమును జూడదలచినవారై నాకతి ప్రియంబగు మందర పర్వతమును గురించి వెళ్ళిరి. అటుచని నాముందు నిలిచినవారై మదేకచిత్తులై, అంజలిబద్ధులగుచు; స్తోత్రము చేయుచుండగా, నేనా బ్రహ్మేంద్రాదుల జ్ఞానమును హరించినంతనజ్ఞానమున నన్ను "నీవెవ్వడవని" యడిగిరి.

శ్లో॥ అథాఽబ్రువమహం, దేవానామహమేన పురాతనః ॥10॥
ఆసంప్రథమమేవాహం, వర్తామిచ సురేశ్వరాః ।

భవిష్యామిచలోకేఽస్మిన్మత్తో నాన్యోఽస్తికశ్చన ॥11॥
వ్యతిరిక్తంచమత్తోఽస్తి, నాన్యత్కించిత్సురేశ్వరాః ।

నిత్యోఽనిత్యోఽహమనఘో బ్రహ్మాణాంబ్రహ్మణస్పతిః ॥12॥
దక్షిణాంచ ఉదంచోఽహం, ప్రాంచః ప్రత్యంచమేవచ ।

అధశ్చోర్ధ్వంచవిదిశోదిశశ్చాహం సురేశ్వరాః ॥13॥
సావిత్రీచాపి గాయత్రి, స్త్రీపుమానపుమానపి ।

త్రిష్టుప్ జగత్యనుష్టుప్చ, పంక్తిశ్ఛందస్త్రయీమయః ॥14॥
గౌరహంగహ్వరంచాహం..............................

జేష్ఠస్సర్వసురశ్రేష్ఠో వరిష్ఠోఽహమపాంపతిః ।
ఆర్యోఽహంభగవానీశస్తేజోఽహంచాదిరప్యహమ్ ॥

ఋగ్వేదోఽహం యజుర్వేదః, సామవేదోఽహమాత్మభూః ।
అథర్వణశ్చమంత్రోహం తథాచాంగిరసోవరః ॥

ఇతిహాస పురాణాని, కల్పోహం కల్పవానహం;

నారాశంసిచగాధాహం విద్యోపనిషదోఽస్మ్యహం ।
శ్లోకాసూత్రాణిచైవాహ మనువ్యాఖ్యానమేవచ ॥

వ్యాఖ్యానానితథావిద్యా, ఇష్టంహుతమథాహుతిః ॥౧౯॥
దాతా దత్తమయం లోకః, పరలోకోఽహమక్షరః ।

క్షరస్సర్వాణి భూతాని దాంతిశ్శాంతిరహం ఖగః ॥20॥

ఈ విధముగ సమస్త ప్రపంచాన్నే వ్యాపించియున్నవాడనని దన నిజ స్వరూపాన్ని దేవతలకు బ్రహ్మకునుద్బోధించి యున్నాడు.



# సిద్ధాంత శిఖామణి ద్వితీయాధ్యాయము

## జగత్సృష్టివిచారము

శ్లో॥ శివరుద్ర మహాదేవ, భవాదిపదసంజ్ఞితం ।
అద్వితీయమనిర్దేశం, పరంబ్రహ్మ సనాతనం ॥6॥

సి. శి. అ, 2 శ్లో॥ 6

తా॥ శివరుద్ర మహాదేవ-భవ అను పదసజ్ఞ, అద్వితీయము, అనిర్దేశం (చెప్పడానికి వలనుపడని) సనాతనమైన పరబ్రహ్మకే సంకేతములు (నామధేయములై యున్నవి) ఈ శ్లోకముయొక్క అర్థమునే శివగీతలో నిట్లు చెప్పబడినది.

శ్లో॥ యతోవాచోనివర్తంతె, అప్రాప్యమనసాసహ ।
ఆనందం బ్రహ్మమాంజ్ఞాత్వా, నభిభేతికుతశ్చన ॥

(51) శివగీత 6వ అధ్యాయము

తా॥ వాఙ్మనసా గోచరుండనై యానందబ్రహ్మమగు నన్ను దెలిసికొనిన పండితుడు ఎందువల్లను భయమొందడని సాక్షాత్పరమశివుడే రామునకుపదేశించి యున్నాడు.

శ్లో॥ తత్రలీనమభూత్ పూర్వం చేతనాచేతనంజగత్ ।
స్వాత్మలీనంజగత్కార్యం, స్వప్రకాశంతదద్భుతం ॥ ॥/॥

సి. శి. 2 పరి. జగత్సృష్టి ని

ఇదే అర్థమును శివగీత షష్ఠాధ్యాయములోను ఉక్తమై యున్నది.

శ్లో॥ శృత్వేతిదేవామద్వాక్యం, కైవల్యంజ్ఞానముత్తమం ।
జపంతోమమనామాని, జపధ్యాన పరాయణాః ॥52॥

సర్వేతెస్వస్వదేహాంతె, మత్సాయుజ్యంగతాః పురా,
తతోయేపరిదృశ్యంతె, పదార్థామద్విభూతయః ॥53॥

మయ్యేవ సకలంజాతం, మయిసర్వం ప్రతిష్ఠితం ।
మయిసర్వంలయంయాంతి, తద్బ్రహ్మాఽద్వయమస్మ్యహమ్ ॥54॥

తా॥ కైవల్యజ్ఞాన మెఱింగి దేవతలందరు నా నామములఁ జపించుచు జపధ్యాన పరాయణులై వారివారి దేహావసానములందు నా సాయుజ్యమునే బొందిరి. అందుచేతనే యే పదార్థములు కనబడుచున్నవియో యవి యన్నియు నా విభూతులే, సర్వము నాయందే బుట్టినవి. నాయందే యున్నది. నా యందేలయించును గాన నేను అద్వితీయ బ్రహ్మమైతినని శివుడు రామునకుపదేశించి యున్నాడు.

శ్లో॥ అణోరణీయానహమేవ తద్వన్మహానహం విశ్వమహం విశుద్ధః ।
పురాతనోఽహం పురుషోఽమీశో, హిరణ్మయోఽహం
శివరూపమస్మి ॥55॥ శివగీత అ. 6

తా॥ సూక్ష్మ పదార్థంబులకు సూక్ష్ముండనై మహత్పదార్థంబులకు మహీయుడనై, పురాణ పురుషుండనై, విశుద్ధుండనై, హిరణ్మయుండనై, శివ రూపుండనై యుందును. (అని దన విశ్వరూపమును నిర్దేశించి యున్నాడు శివుడు.)

ఈ శివగీతలోని పాఠమునే సిద్ధాంత శిఖామణికర్తయైన శివయోగి శివాచార్యులవారిట్లు శివాధిక్యతను వర్ణించియున్నారు.

శ్లో॥ శివాభిదంపరబ్రహ్మ, జగన్నిర్మాతుమిచ్ఛయా ।
స్వరూపమాదధేకించి, త్సుఖమ్మూర్తి విజృంభితం ॥8॥

సి శి. 2 పరి.

తా॥ ఆ పరమ శివుఁడు మరల జగత్తును సృష్టింప నెంచినవాడయ్యెను.

శ్లో॥ సశంభుర్భగవాన్‌దేవః, సర్వజ్ఞః సర్వశక్తికః ।
జగత్సిసృక్షుఃప్రథమం, బ్రహ్మాణం సర్వదేహినాం ॥౧౩॥ (13)

తస్మై ప్రథమ పుత్రాయ, శంకరః శక్తిమాన్‌విభుః ।
సర్వజ్ఞ సకలావిద్యాః, సానుగ్రహాముపాదిశత్ ॥14॥

ప్రాప్తవిద్యో మహాదేవా బ్రహ్మావిశ్వనియామకాత్ ।
సమస్త లోకనిర్మాణ, సముద్యోగపరోఽభవత్ ॥15॥

కృతోద్యోగోఽపినిర్మాణె, జగతాంశంకరాజ్ఞయా ।
అజ్ఞాతోపాయసంపత్తి, రభవన్మాయయావృతః ॥16॥

విధాతు మఖిలాన్ లోకానుపాయం ప్రాప్తుమిచ్ఛయా ।
పునస్తంప్రార్థయామాస, దేవదేవం త్రిలోచనం ॥ ॥17॥

నమస్తె దేవదేవేశ, నమస్తె కరుణాకర
అస్మదాది జగజ్జాల నిర్మాణ విధిషు అక్షమః ॥ ॥18॥

ఉపాయంవదమే శంభోజగత్స్రష్టా జగత్పతే ।
సర్వజ్ఞః సర్వశక్తిస్త్వం, సర్వకర్తా సనాతనః ॥ ॥19॥

ఇతిసంప్రార్థితః శంభు ర్బ్రహ్మణా విశ్వనాయకః ।
ఉపాయమవదత్తస్మై, లోకసృష్టి ప్రవర్తకం ॥ ॥20॥

ఉపాయమీశ్వరేణోక్తం, లబ్ధ్వాఽపిచతురాననః ।
నసమర్థోఽభవత్కర్తుం. నానారూపమిదం జగత్ ॥ ॥21॥

భవదుక్తోఽప్యుపాయోమె, నకించిత్ జ్ఞాయతేఽధునా ।
సృష్టింవిధేహిభగవన్, ప్రథమంపరమేశ్వర ॥ ॥25॥

ప్రబోధపరమానంద, పరివాహితమానసాన్ ।
ప్రమథాన్ విశ్వనిర్మాణ, ప్రలయాది విధిక్షమాన్ ॥ ॥26॥

సృష్ట్వప్రమథవర్గేషు, వర్ణాశ్రమపరిక్రమాన్ ।
అప్రాకృత సదాచారానుపాదిశదథప్రభుః ॥ ॥27॥

తా॥ ఇట్లు మొట్టమొదట శివుఁడు ప్రమథులను సృష్టించి బ్రహ్మకు మార్గదర్శకుడైనాడు. కావున సృష్టిస్థితి-లయములకు శివుడేకర్త.

# జగద్గురు శ్రీ రేణుకాచార్యులు

శ్రీమత్పరమశివుని సద్యోజాతముఖము నుండి యుదయించిన జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారు భూలోకమున పుణ్యక్షేత్రమైన కొలనుపాక శ్రీ సోమనాథ లింగమున యవతరించి సమస్త మానవులకు చతుర్విధ పురుషార్థములను బడయుటకై వేదాగమోపనిషత్, శృతి, సూత్ర పురాణాంతర్గతంబైన శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదకమగు వీరశైవ ధర్మ తత్త్వమును శ్రీ అగస్త్యాది మహా మునులకుఁ బోధించి ప్రపంచములోని బహుభాగమును శివమయముగా జేసియున్నారు. నేటికి నాయా ప్రదేశము లందు గోచరించుచుండిన శివాలయములు, శివ లాంఛన విగ్రహములు మరియు శిలాశాసనములు వీనికాధారములై యుండినవి.

ఈ విధముగా వీరశైవ ధర్మము సమస్త మానవుల జన్మ సార్థకత కుపదేశింపఁబడి భవిష్యత్తులోను భావితరము వారికి అవగతమగు రీతిని ధర్మప్రచారము జేయుటకై కన్నడ ప్రాంతమునందు చిక్క మంగళూరు మండలములో పవిత్ర క్షేత్రములలో నొకటైన భద్రానది సమీపమున గురు పీఠమును స్థాపించిరి. ఆ ప్రాంతములోని గ్రామ - నగరములలోను యోగ్యులైనవారికి శివదీక్షా సంస్కారమును గావించి తమ కుపాచార్యులను ప్రతినిధులనుగా నియమించి ఉప మఠములను నెలకొల్పిరి.

ఇట్టి ఉపాచార్యుల మఠములన్నింటికి కేంద్రముగా శ్రీ మద్రంభా పురిలో (బాళెహాళ్ళిలో) వీర సింహాసనము సంస్థాన పీఠమై విరాజిల్లు చున్నది. ఈ మహా సంస్థానము యొక్క పరిపాలనా బాహుళ్యముతో

జనసాంద్రత హెచ్చి (అధికమై) చివరికి బాళెహొన్నూరు అను గ్రామముగా పరిణమించినట్లు తెలియుచున్నది* ఈ మహాపీఠము యొక్క స్థాపనము జరిగిన కాలము బహు పురాతనమై సహస్రారు సంవత్సరములు గడచిపోవుట చేత నిదిర్మైతిహాసికముగా కాలమానమును ఇదమిద్ధముగా నిర్ధారించుట యసంభవము. అయినను ఆయా సమయములలో ప్రచలితమైయున్న పరధర్మముల ఔన్నత్యముల ప్రభావములను మరియు నాయా కాలములోని రాజకీయ పరివర్తనములను బరిశీలించినప్పుడు ఈ పీఠము సనాతనమైనదని స్పష్టముగా దోచుచున్నది.

శ్రీమత్ రేణుకాచార్య భగవత్పాదులు ఈ వీరశైవ ధర్మ తత్త్వము ప్రచారముజేయు సమయమున భారతదేశము మరియు నన్య దేశీయ మహారాజులు ఈ వీరశైవ మతావలంబులైనట్లు అనేక పురాణేతిహాసములవలన దెలియుచున్నది.

ఇదేరీతి మైసూరు మహారాజుల వంశముయొక్క రాజ్యస్థాపకులైన మూలకర్త మహారాజుల కాలమునుండియు వీరశైవ గురు పుంగవుల కృపాశీర్వాదములకు బాత్రులై యుండినది చరిత్రార్థమై యున్నది.

జగద్గురు శ్రీ రేణుక శివాచార్య భగవత్పాదులు. ఈ శ్రీ మద్రంభాపురీ పీఠమును స్థాపించి వీరశైవ సామ్రాజ్యమును ఏక ముఖముగా బహు

---

*ఇక్కడ :- బాళె = అనగా అరటి చెట్టని అర్థమున్నందు వలన అచ్చోట మొదలు అరటి వనము అథవా అరటి తోటలు బహుళముగా నుండుటవలన బాళెహొళ్ళి అనగా గ్రామమని అర్థము. మరోరీతిగా విచారించినచో ఆ గ్రామ ప్రజలు బాళు అనగా జీవించు అని అర్థము చిరంజీవులై యుందురని అర్థము.

కాలము సులలితముగా నిర్వహించుచు తరువాత శ్రీ రుద్రముని శివాచార్యుల వారికి ఈ వీర సింహాసనమున పట్టాభిషిక్తునిఁ జేసి, మరల శ్రీ సోమనాథ లింగమునందే ఐక్యులైరి. ఆ పిదప నా కోవకు జెందిన పట్టాభిషిక్తులు బహుకాలము తమ శివ యోగముయొక్క తపః ప్రభావముచేత నొకే రీతిగా వీరశైవ ధర్మ ప్రచారమును నిర్వహించుచు తమ ఉపాచార్యులకు తటస్థించిన యుపద్రవములను నివారించి ధర్మ ప్రచారము యథారీతి సాగు నటుల యొనర్చి ధర్మ మార్గ భ్రష్టులైన వారిని శిక్షించి ప్రాయశ్చిత్తములతో వారిని మరల యుద్ధరించుచుండిరి.

కాలము గడచినకొలది కలికాలము ప్రభావము చేతనైతేనేమి, రారాజుల పరస్పర వైరుధ్యముల ప్రభావము వలననైతేనేమి; రాజ్యములు అప్పుడప్పుడు ఛిన్నాభిన్నములై సమాజ మైక్యతతో నిలువక బహుముఖముగా ధర్మ ప్రచారము తగ్గుతూ వచ్చియుండెను; అంతేగాకుండ నాటి పీఠాధిపతు లసమర్థులగుట వలనను తమతమ పీఠముల గౌరవ మర్యాదలను మాత్రమే నిల్పుకొనుట యందే నిరతులై యుండిరి. ఈ సందర్భమున ధర్మమున కనాదరణ యేర్పడి అనేక ఉపాచార్యుల మఠములు నశించుటే గాకుండ పలు మఠములు స్వతంత్రములై తమకు దోచిన రీతిని ప్రవర్తింపఁ దొడగెను.

ఈ సమయమందే బసవాది ప్రమథులు ఉద్భవించి యీ వీరశైవ ధర్మ తత్త్వములను విరివిగా ప్రచారము గావించి యీ ధర్మముయొక్క విశిష్టత నభివృద్ధి పరచిరి.

ఇట్టి సందర్భమునందును ఈ పంచ పీఠాధిపతులు విశేషముగా వీరశైవ ధర్మాభివృద్ధికై పాటుబడి యధిక కృషి యొనర్చినటుల పురాణేతిహాసములవలన ధృవపడుచున్నది.

ఈ వీర సింహాసనాధి పతులలో నత్యంత ప్రసిద్ధి చెందినవారు ౧౧౪ (114) పీఠాధీశులైన జగద్గురు శ్రీ చంద్రశేఖర దేశికేంద్ర శివాచార్యులవారి కాలమున అప్పటి శ్రీమన్ మహారాజులైన శ్రీ . చామరాజ ఒడెయరు మహా ప్రభువులు తేది 21-12-1885 న ఈ వీర సింహాసనాధిపతులను సందర్శించి యా పీఠాధిపతులచేత తీర్థ ప్రసాదములను స్వీకరించి యున్నారు. అట్లే తేది 30-11-1931 లో మొదటి మహారాజులైన శ్రీ నాల్వడి కృష్ణరాజ ఒడెయారు గారు తేది 16-2-1941న మహారాజ జయచామరాజ ఒడయరుగారు ఈ పూజ్య మఠమును సందర్శించి తీర్థ ప్రసాదములను స్వీకరించి యున్నారు.

ఇటీవల ప్రజా ప్రభుత్వము స్థిరపడిన పిదపగూడ మైసూరు ప్రధానామాత్యపుంగవులు, ఇతర మంత్రులు ఈ పీఠాధిపతుల దర్శనాశిస్సుల బడసియున్నారు. ఈ విధముగా ముఖ్యాధికారులు, రాజకీయాధి నేతలెందరో ఈ పీఠాధిపతులకు తమ భక్తి, భావములను ప్రకటించి యున్నారు.

ఈ పీఠమునధిష్ఠించిన ౧౧౭ (117)వ పీఠాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు శ్రీ పంచాక్షర శివాచార్యుల వారి కాలమున శ్రీ కాశి క్షేత్రము యొక్క జ్ఞాన పీఠమునందు పంచ పీఠాచార్యుల సమ్మేళనము తేది 21-1-1918న నిర్వహించబడి; అందు సమాజమును సుధారించుటకై యత్యుత్తమ విషయములను చర్చించి నిర్ణయించిరి.

తరువాత నీ పీఠము యొక్క ప్రభావము కొంత కాలము వరకు తగ్గినందున ఈ పీఠము నధిష్ఠించుటకై యెన్నుకొనబడిన వటువుల విషయమై సమాజమున భిన్నాభిప్రాయములుప్పతిల్లి చివరికి శ్రీ శృంగేరి పీఠాధీశ్వరుల సహాయ సహకారములతో అప్పటి శ్రీ నాల్వడి కృష్ణరాజ ఒడయార్

మహాప్రభువులాశ్రయముతోను, శ్రీమదుజ్జైని సద్ధర్మ సింహాసనా ధీశ్వరులు శ్రీశ్రీ జగద్గురు సిద్ధలింగ శివాచార్య మహా స్వాములవారి తపః ప్రభావముచేతను, మరియు వే॥ పం॥ శ్రీ కాశీనాథశాస్త్రి గారి ప్రభావముచేతను అభినవ రేణుక శివానంద శివాచార్య మహాస్వాములవారు ౧౧౮ (118) వ పట్టాభిషిక్తులై విచ్చేసిరి. వీరి యధికార పరిపాలనలో సంస్థానము యొక్క సమస్త వివిధ కార్య కలాపములు సాంగముగా నెరవేర్చబడినవి, (నిర్వహించబడినవి). కర్నాటక ప్రాంతములను బర్యటించి యీ వీరశైవ సమాజము యొక్క మూల పంచపీఠములను మరియు వీరశైవ ధర్మ నిజస్వరూపమును భక్తులందరికిఁ దెలియపరచి; ఈ పురాతన గురు పీఠము లను ప్రకాశింపజేసిరి. మైసూరు మహరాజా శ్రీ నాల్వడి కృష్ణరాజా ఒడెయార్ గారు ఈ జగద్గురువులను మైసూరునకు దయజేయవల్సినదిగా వాహ్వానించి రాజధానియందు సమస్త రాజ బిరుదావళులతో (రాజ లాంఛనములతో) మహా వైభవ గౌరవములతో దమ రాజ భవనమునకు రప్పించుకొని పాద పూజ యొనర్చి తీర్థ ప్రసాదములను భక్తితో స్వీకరించి; గురు కానుకలను సమర్పించి ఫలాశిస్సులను బడసి యత్యంతానంద పరవశులైరి.

వీరి సమయములోనే వీరి ప్రభావమునకు తలొగ్గి బెంగుళూరు సిటి నివాసులైన శ్రీ బళ్ళప్పగారు తమ యొక్క మరియు తమ పూర్వీకుల యొక్కయు పుణ్యార్థ ప్రదముగా తమ స్వాధీనము నందున్నట్టి సుమారు రెండు లక్షల రూ॥ల విలువజేసే గృహములు మరియు దుకాణములను (అంగడులను) శ్రీ గురువులవారి పాదములకు దానముగా నర్పించిరి:

శ్రీ గురువరేణ్యులు ఇట్టి దానమును స్వీకరించి బెంగుళూరు సిటి నివాసులైన వీరశైవ సమాజము వారినే దానికి (ఆ ఆస్తికి) ట్రస్టీలముగా

నియమించి యీ సంపదచేత సంతృప్తిగా సంస్కృత విద్య నభ్యసించు విద్యార్థులకుచిత భోజన వసతులను గల్పించవలయునని తీర్మానించి; యట్టి సంపదను ట్రస్టీలకు స్వాధీనమొనర్చిరి. ఇదే మేరకు నేటికిని యిది "మహంతర మఠము" సంస్కృత విద్యార్థులకు నిలయముగా నిర్వహింపఁ బడుచున్నది.

తమ రంభాపురీ పీఠముయొక్క బృహన్మఠము శిధిలత్వమందియుండగా దానికి విపులముగా ధనమును వ్యయపరచి భవ్యమగు బృహన్మఠమును జీర్ణోద్ధారము గావించి శాశ్వత కీర్తికిఁ బాత్రులైరి. వీరు తమ అధికార కాలమానమున నిర్వహించబడిన దసరా మహోత్సవము వర్ధంత్యుత్సవము ఇంక నితర మహోత్సవముల సందర్భములందును, పండితులను, శాస్త్రులను, కీర్తనకారులను, సిపాయీలను, వాద్యకారులను, కలావిదులను, విద్వాంసులను, వారివారి యోగ్యతల ననుసరించి గౌరవించి విద్వత్ ప్రియులని ప్రఖ్యాతిగాంచి చిరస్మరణీయులైరి.

వీరుండిన సమయములో శ్రీమదుజ్జయినీ సద్ధర్మపీఠాధిపత్యమును శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు సిద్దేశ్వర శివాచార్య మహాస్వాములవారి ననుగ్రహించిరి. మరియు వీరు కాశీక్షేత్రమునకు విచ్చేసి కాశిక్షేత్రముయొక్క జ్ఞాన సింహాసన పీఠమునకు పట్టాధికారమును మొదటి (ఇప్పుడున్న వారికంటె ముందున్నవారు) శ్రీ శ్రీ శ్రీ ౧౦౦౮ (1008) జగద్గురు వీరభద్ర శివాచార్య మహాస్వాముల వారిని పట్టాభిషిక్తుని గావించి యనుగ్రహించిరి.

ఈ మహాస్వాములవారు సంచారమునకై వెళ్ళి బెంగుళూరు సిటీ యందున్నప్పుడు దేహారోగ్యము చెడినట్లు గుపడగా వెంటనే తమ పీఠమునకుఁ

దగినట్టి సిటి చిక్కపేటి శ్రీ "మహాంతర" మఠము యొక్క పట్టాధ్య క్షులై యున్న వారి కొప్ప గ్రామము యొక్క బృహన్మఠాధ్యక్షులై యున్న వీరగంగాధర శివాచార్యులవారి పేరిట స్థిలునామ వ్రాసి రిజిస్టర్ జేయించి తేది 1-8-1946లో శివైక్యులైరి.

లిం॥ శ్రీ శ్రీ శ్రీ ౧౦౦౮ జగద్గురు ప్రసన్నరేణుక వీర గంగాధర శివాచార్య మహా స్వాములవారు శ్రీ మదుజ్జయినీ శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు సిద్దేశ్వర శివాచార్య మహాస్వాములవారిచేత తేది 2-5-1947 న శ్రీ మద్రంభాపురి మఠము యొక్క పీఠము నలంకరించిరి. భక్తోద్ధార కార్యములనేకములను చేపట్టి అందు విజయమును సాధించి జాతి భేదములను పాటించక సమస్త ధర్మములవారి హృదయములనాకర్షించి వీర సింహాసనము యొక్క గౌరవ ప్రతిష్ఠలను పెంపొందించిరి.

వీరి శివపూజా వైభవము అతి మహత్వపూర్ణమై యుండుట వలన నభూతో నభవిష్యత్తులందును ఎవరు జేయనట్టి మంగళకార్యములను పూరయించి కర్నాటకాంధ్ర మహారాష్ట్ర ప్రజలు అహమహమికలతో తండోప తండాలుగా విచ్చేసి సన్నిధి వారి పూజా వైభవాదులను దిలకించి యానంద భరితులై శ్రీ సన్నిధివారి పాద తీర్థ ప్రసాదములను స్వీకరించి ధన్యులగు చుండిరి. ఈ నవీనకాలములోను వీరశైవులలో సామూహిక వీర లింగపూజా వైభవమును దిలకించినచో నేంతటి నాస్తికునకు గూడ శివపూజ జేయు బుద్ధిగలుగు చుండెడిది.

వీరు దేశ పర్యటన సాగించి సర్వత్ర అడ్డపల్లకి మహోత్సవమును మరియు సహస్ర కుంభాభిషేక పూర్వకమైన శివపూజా వైభవమునునాచ రించి సమస్త భక్త మండలికి శివయోగానందామృతమును ప్రసాదించి

యున్నారు. దీనివలన వీరికి శీతాతప వర్షా కాలములందు నిరంతరము భక్తుల యొక్క ఆహ్వానము లధికమగు చుండెడివి.

వీరు ధారవాడ జిల్లాయందు ముక్తిమందిరమను, ధర్మక్షేత్రము నొకదానిని స్థాపించి శ్రావణ మాసములో మరియు శివరాత్రి జాత్ర మహోత్సవములను గొప్ప ప్రమాణమున నిర్వహించుచుండిరి. పలు ప్రాంతముల నుండి ప్రజల సమూహము వెల్లివిరిసిన ప్రవాహములా వచ్చి వీరి ఉత్సవములో పాల్గొనుచుండిరి.

వీరగంగాధర శివాచార్య మహాస్వాముల వారు ఆరు భాషలలో పాండిత్యము నార్జించి యుండిరి. అందుచేత సమస్త జనుల నాకర్షించి యుండిరి. వారి ముఖమున బ్రహ్మచర్య తేజస్సుతో కళకళలాడుచుండెను. రుద్రాక్ష కిరీట ధారణము, అడ్డపల్లకీ ఉత్సవాల్లో బంగారు కిరీటమునుగూడ ధరించుచుండిరి. దేహమంతటను త్రిపుండ్ర భస్మధారణము, బవిరు గడ్డముచేత యోగదండము పాదుకలను ధరించియుండిరి. వీరి ఆస్తి రాజఠీవి వంటిది. వీరనేక ధార్మిక, పాశ్చాత్య పాఠశాలలను నెలకొల్పిరి. ధర్మధ్వజమును ఎత్తి నిల్పిరి. సమాజములో నవచైతన్యమును పెంపొందింప జేసిరి.

వీరు జీవించియుండగనే యోగ్యులైన పాండిత్యముతో పరిపూర్ణులై యున్న ప్రస్తుతములో వారి సింహాసనములంకరించి యున్న శ్రీ శ్రీ జగద్గురు ప్రసన్న రేణుక "వీరరుద్రముని రాజదేశి కేంద్ర శివాచార్యుల వారిని" తమ కుత్తరాధికారిగా స్వీకరించి పీఠముయొక్క సమస్త భాధ్యతలను వారికప్పగించిరి. వీరిప్పుడున్నవారు. వీరుగూడ సంస్కృతము, కన్నడ, మరాఠి, హిందీ మున్నగు భాషలయందు మంచి పాండిత్యము గలవారు.

మతతత్త్వ సిద్ధాంతములను ప్రతిపాదించుటలో వీరు నిష్ణాతులు. తమ గురువరేణ్యులు జూపిన మార్గముననే అడుగిడుతు పెద్ద సంస్థానము యొక్క కార్యకలాపములను యథాప్రకారముగ నిర్వహించు చున్నారు. శ్రీవారి కాలములోనె తమకు మూలస్థానమైన ఆంధ్రప్రదేశమునకు రాజధాని యైన హైద్రాబాదుకు చేరువలోని ఆలేరు రైలు స్టేషన్‌కు 2 మైళ్ళ దూరములోనున్నట్టి నల్లగొండ జిల్లా భువనగిరి తాలూక కొలనుపాక పుణ్యక్షేత్రమున వెలసియున్న శ్రీ సోమేశ్వర మందిరమును సందర్శించుటకై 1984వ సం॥ మే 25లో 25 కార్లతో 200మంది భక్తబృందముతో విచ్చేసి వే॥పండిత రాచవీర దేవర"తీర్థ" ఎం.ఓ.ఎల్.గారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున వీరి యాహ్వానంపై విచ్చేసి శ్రీవారి వనుగ్రహించిరి; వీరశైవ విద్యావర్ధక హాస్టలులో ఈ సమయమున జరిగిన బహిరంగ మహాసభలో వీరశైవ సిద్ధాంతంపై సుదీర్ఘముగానుపన్యసించి భక్తామహేశ్వరులెల్లరను ఆశీర్వదించి వెళ్ళిరి. తేది 18,19,20 మే నెల 1990 లో మరల ఆంధ్రప్రదేశ వీరశైవ మహాసభ హైద్రాబాదువారి ప్రార్థనమేరకు జ॥ పంచ పీఠాధీశులు విచ్చేసి తమ అమృతవాణితో వీరశైవ సిద్ధాంతమును సమగ్రముగా ఉపదేశించి తృప్తిపరచి యున్నారు. కనుక జగద్గురువులందరి పాదారవిందములకు ఆంధ్రప్రదేశ భక్తామహేశ్వరుల పక్షాన కృతజ్ఞతాభివందనములు.



# శ్రీ మధుజ్జయిని పీఠాధిపతులు

శ్రీ శివాగమోక్త ప్రకారముగా పరమశివుని వామదేవ ముఖోద్భూతులైనట్టి భారత జ్యోతిర్లింగములలో ఒకటిదైన ఉత్తర హిందుస్థానమునందలి ఉజ్జయిని వటవృక్ష సిద్ధేశ్వర లింగమునుండి జ॥ మరుళారాధ్యుల వారు ఆవిర్భవించిరి. అక్కడ శివాద్వైత సిద్ధాంత ప్రచారమునకై సద్ధర్మ సింహాసనము నొకదానివి స్థాపించిరి. ఇక్కడ వందకుమించిన పీఠాధికారులై (అన్య) ఇతర మతీయుల ఉపద్రవములవలన నాటి పీఠాధిపతులై యున్న జ॥ మరుళారాధ్యుల వారు జ॥ రేవణ సిద్ధేశ్వరులవారి ఆజ్ఞానుసారముగా తమ పీఠమును దక్షిణదిశకు తరలించి కల్యాణ సోమేశ్వరుని సహాయముతో బళ్ళారి జిల్లా యందలి కొట్టూరువద్ద ఆ ధర్మపీఠమును సుమారు క్రీ.శ. 1054లో స్థాపించిరి. పిదప నీస్థలమే ఉజ్జయినిగా ప్రసిద్ధిగాంచి సద్ధర్మ సింహాసనమునకు మూల పీఠమైనది. ఇట్టి విషయములు శైవాగమముల నుండియు మరియు హాలి నందీశకవి ప్రణీతంబైన "మరుళాధ్య" విజయమను కావ్యములో వివరింపబడినది.

ఇట్టి ఉజ్జయిని మరుళసిద్ధేశ్వర దేవస్థానము యొక్క రచన శిథిలమైన మహద్వారము గోపురము మరియు కొన్ని అవశేషములు అక్కడ పాతిపెట్టిన నేల గృహముల యొక్క శివలింగము, శిలా లేఖనములను బరిశోధించుటవలన ఈ పీఠము సుమారు ఒక వేయి సం॥ ములకు పూర్వముండినదని నిర్ణయించ నగుచున్నది. ఈ పీఠమునకు 109 వంద తొమ్మండుగురు పీఠాధిపతులై గతించియున్నారని దెలియుచున్నది.

పరంపరాగతమైన ఇట్టి గురు వంశములో చన్న వీర శివాచార్య మహాస్వాములవారు 103 వ పీఠాధీశులై యుండి యీ మహా సంస్థానము యొక్క పరిపాలనమును భక్తమండలియొక్క శ్రేయోభివృద్ధికై విస్తరింప జేసి బహు శక్తి సామర్థ్యములతో తమయొక్క శివయోగ తపఃప్రభావము చేతను ఈ పీఠమును అత్యున్నత స్థాయికి బెంచిరి. వీరు శివపూజా ధురంధరులై అప్పుడప్పుడు దేశ పర్యటనము గావించి భక్తులకు ధర్మోప దేశమును జేయుచు వీరశైవ ధర్మ సామ్రాజ్య పాలనమొనర్చిరి. ఇట్లు కొంత కాలముగడచిన తరువాత వీరు లింగైక్యులైరి.

వీరి తరువాత 104 వ జగద్గురు శ్రీ చన్నబసవ శివాచార్య మహా స్వాములవారు పీఠమునలంకరించినవారై యీ వీరశైవ ధర్మ సామ్రాజ్య మును వీరి పూర్వీకులవలె సంస్థాన కార్యకలాపములను నిర్వహించుచు ఇష్టలింగ పూజాసక్తులై పీఠముయొక్క గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింప జేసిరి. భక్తులయొక్క మనఃప్రవర్తులను చూరగొనిరి. పిదప కొంత కాలము తరువాత వీరుగూడ శివైక్యులైరి.

వీరి తరువాత 105 వ శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు గురు సిద్ధ శివాచార్య మహాస్వాములవారు పీఠాధీశులైరి. వీరు పద్ధతి ప్రకారముగా దేశ పర్యటనము గావించి భక్తాదులకు ధర్మోపదేశము జేయుచు కొంత కాలము గడచిన పిదప బళ్ళారి జిల్లా కూడ్లగి తాలూక మంగాపురమను గ్రామమున లింగైక్యులైరి.

వీరి తరువాత 106 వ వారు శ్రీ శ్రీ శ్రీ 1008 జ॥ గురు సిద్ధ శివాచార్య మహాస్వాములవారు పీఠమునందు పట్టాభిషిక్తులైరి. (సింహాసనము నలంకరించిరి). వీరు పరిపూర్ణ పాండిత్యముగలవారు. వాగ్మి సాహసో పేతులే గాకుండ శివానుభవశాస్త్ర పారంగతులు, శిష్య సంతాప హారకులు,

"శివానుభవ" పతంజలి యోగశాసనమను గ్రంధములను రచించి ప్రకటించి యున్నారు. ఇట్లే కొంత కాలము వీరు అధికారమును నెరపుతు తమ పీఠము యొక్క పరిపాలనా దక్షతనభివృద్ధి పరచవలెనను విచారముతో "తుంబరగుడ్డి" అను గ్రామ విరూపాక్షశాస్త్రి గారికి స్థిర పట్టాధికారమును "బంగారనాయకనహళ్ళి" శ్రీ సిద్దలింగాచార్యులను వారికి చరపట్టాధి కారమును అప్పగించిరి. కొంత కాలము తరువాత కొట్టూరు నగరమున శివైక్యులైరి.

వీరి తరువాత వీరి సంకల్పము మేరకు శ్రీ విరూపాక్షశాస్త్రి గారు శ్రీ జగద్గురు చన్నబసవ శివ బసవ శివాచార్యులను వారు ఈ పీఠమునకు 107 వ స్థిర పట్టాధ్యక్షులైరి. వీరు కన్నడ, తెలుగు, సంస్కృతము ఈ భాషలయందు మంచి పాండిత్యముగలవారు. మహా మేధాసంపన్నులు, సమాజోద్ధార కార్యక్రమములందు చాలా ఉత్సుకతగలవారై యుండిరి.

అ మీదట హరపనహళ్ళి ప్రాంతములో పర్యటించుచు బళ్ళారిలో జరిగిన 5వ అఖిలభారత వీరశైవ మహాసభకు విచ్చేయుచు మార్గమధ్యలోనే కేడెకొళ్ళ అను గ్రామమున వీరశైవ సమాజము దుర్దైవముచేత నకస్మా త్తుగా లింగైక్యులైరి.

వీరి తరువాత ఆ పీఠమునకు చర పట్టాధ్యక్షులైన హిరె మఠము శ్రీ సిద్ధలింగ శివాచార్యులవారే ఈ పీఠమునకు 108 వ పీఠాధీశులై ప్రసిద్ధిగాంచిరి. వీరుగూడ కన్నడ, సంస్కృతములందు గొప్ప పాండిత్యము వార్జించి, తర్క, వేదాంత, వ్యాకరణాది శాస్త్రములందు నిష్ణాతులై యుండిరి. వీరు జితేంద్రియులై శివపూజా నిష్ఠాగరిష్ఠులై, దివ్యజ్ఞానియు, తపోబలము ప్రబలముగా నుండుటవలన మహా శివయోగులుగా ప్రఖ్యాతి గాంచి శాపానుగ్రహ సమర్థులైరి.

ఈ మహానుభావులు శ్రీ జగద్గురు పంచ మహాపీఠములను ప్రపంచ ములో ప్రకాశించునట్లుగా జేయఙూని గురువర్గమువార్ని నుధారించి ప్రసిద్ధికి దేవలయునను వీరశైవ సమాజాభివృద్ధికొరకు ధర్మము, నీతి, భక్తి, శ్రద్ధ దినదిన ప్రవర్ధమానము గావింపజేయవలెనని అహర్నిశలు అత్యంతాభిమానముతో ప్రయత్నించిరి. వీరి కృషికి జేయూత నొసఁగిన శ్రీ నాగనూరు బృహన్మఠాధిపతులైన వే॥ పండిత కాశినాథశాస్త్రి గారు కార్యదక్షులై వీరికండగా నిల్చిరి. చిరకాలమునుండి కర్నాటక ప్రాంతమునకు విచ్చేయకుండిన శ్రీ హిమవత్కేదార పీఠాధీశులు జగద్గురు విశ్వలింగ శివాచార్య మహాస్వాములవారిని రప్పించుకొని వారి ఊరేగింపు ఉత్సవాదులకు అనేక విధముల సాయమొనర్చి వీరశైవ జగత్తుకు ఈ పంచ మహాపీఠములే మూలములని జాటిచెప్పిరి, ఈ విధముగా ఇతర నాలుగు పీఠములపైనను సంపూర్ణాభిమానముంచి వాటి బాగోగుల విచారమునందును పరిపూర్ణమైన మెలకువతో కార్యభారముల కీర్తి ప్రతిష్ఠలను సర్వత్ర ప్రకాశింపజేసిరి.

సమాజోద్ధారము కొరకు బళ్ళారియందు విద్యా వర్ధక సంఘమొక దానిని నెలకొలిపిరి. కొట్టూరు గ్రామంలో శ్రీ దారుకాచార్య సంస్కృత పాఠశాలను స్థాపించిరి, ఉజ్జయినీ మఠమును 30-40 వేల రూ॥ లను వెచ్చించి జీర్ణోద్ధారము గావించి భవ్యమైన శాలాభవనమును నిర్మింపఁ జేసిరి. ఉజ్జయిని మహా సంస్థానమునందు ధార్మిక విద్యాభివృద్ధికొరకు మహా విద్యాపీఠ (సంస్కృత కళాశాలను) మును స్థాపించుటకై 60-70 వేల రూ॥ల నిధిని సంగ్రహించిరి.

ఇదే సమయమున శ్రీమద్రంభాపురీ పీఠాధీశులైన జగద్గురు శ్రీ పంచాక్షర శివాచార్య మహా స్వాములవారు తమ భవిష్యత్పీఠాచార్యులను నియమించుటకు సాధ్యపడక శివైక్యులవడంచేత ఈపీఠమునకు పట్టాధి

కారులను ఎన్నుకొనుట విషయమై సమాజమున బహువిధములైన భిన్నాభి ప్రాయములు వ్యక్తమగుటవలన 4-5 సం॥ ములు శ్రీమద్రంభాపురీ పీఠమునకు పట్టాధికారులే లేనందున ఆ సింహాసనాధీశుల కొరతవలన ఈ పట్టాధికారులను ఎన్నుకొను కార్యక్రమమునకు పండిత కాశీనాథశాస్త్రి గారిని నియమించి తాము బుక్కాంబుధి వద్దనున్న పుణ్యగిరియందు కఠోర తరమైన తపస్సునాచరించి, శివయోగ ముద్రయందుండి చివరికి తాము సంకల్పించిన వటువునే ఈ పీఠమునకు పట్టాధికారిగా నియమించి చరితార్థులైరి.

తమ సంస్థాన మఠములోని పద్ధతి ప్రకారము (సాంప్రదాయ ప్రకారము) శ్రీ మరుళ సిద్ధేశ్వర రథోత్సవము, మరియు దేవాలయ శిఖరముపై తైలధారాభిషేకము, మొదలగు మహోత్సవములను ప్రతి సం॥ము నిర్వహించుటేగాకుండ జాత్రాసమయములందు "సద్ధర్మపరిషత్" లను ఏర్పరచి కార్యక్రమములను నెఱిపిన తదుపరి పండితులను, విద్వాంసులను, కీర్తకారులను (శివ కీర్తనకారులను) సంగీత విద్వాంసులను, వాయిద్య కారులను సన్మానించుచుండిరి.

వీరు దేశములో సంచరించుచు మరియు సంస్థానములో నున్న ప్పుడును భక్తాదులకే గాకుండ అన్య మతీయులకుగూడ వీరి దర్శనమునకై వచ్చి సందర్శించినట్టి, పాదార్చన గావించినట్టి, వీరి యుపదేశా మృతమును గ్రోలిన (వినిన) భక్తులందరిని కృపాదృష్టితో నాశీర్వదించు చుండిరి. ఇట్టి సద్గురువుయొక్క కృపచేత అనేకుల రోగ రుజనములు దొలగిపోవుచుండెను. సంతానాపేక్ష గలవారికి సంతానము గలిగెడిది. కొందరు శ్రీవారి ఆశీర్వాదమువలన కష్టములనుండి తేర్కొని సుఖ శాంతులను బడసిరి. ఇట్లే బహుజనులు ఇష్టార్థములను బడసిరి. ఇట్లు కృతార్థులైన ప్రజలందరు ఈ మహా శివయోగివర్యులు అణిమాద్యష్ట

సిద్ధులున్న మహిమాశాలు రనియు, సాక్షాత్తుగా పరమ శివమూర్తి యవతారమె అని వేనోళ్ళ బొగడిరి.

శ్రీ కాశి పుణ్యక్షేత్రము యొక్క శ్రీమద్ జ్ఞానసింహాసమునందు 1918వ ఇస్వీలో వీరి కృషి ఫలితముగానే పంచాచార్యుల సమ్మేళనమొకటి నిర్వహింపబడి వీరి పరిపూర్ణ ప్రభావముచేత సమ్మేళనము విజయవంతముగా జరిగినది.

ఈ విధముగా ఈ సద్ధర్మపీఠము ప్రకాశింపబడినదై వీరి తరువాత శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు సిద్దేశ్వర శివాచార్య మహాస్వాములవారు పట్టాభిషిక్తులై వీరశైవ సామ్రాజ్య సంస్థానముయొక్క పరిపాలనమును చేబూనిరి. వీరు కన్నడ సంస్కృత విద్యా విశారదులై వీరి పూర్వీకుల మాదిరిగావే పీఠముయొక్క కార్యకలాపములను నిర్వహించుచు శివయోగా నంద నిమగ్నులైరి.

వీరు తేది 7-7-1940లో సూర్య సింహాసనమునకు శ్రీ శ్రీ శ్రీ 1008 జ॥ వాగీశ పండితారాధ్య శివాచార్య మహా సన్నిధిగార్కి పట్టాధి కారము నను్రగహించిరి.

తేది 2-5-1947లో శ్రీ మద్రంభాపురీ వీర సింహనాధికార మును బడసిన శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు ప్రసన్న రేణుక వీరగంగాధర శివాచార్య మహాస్వాములవారికి శ్రీ జగద్గురు వాగీశ పండితారాధ్య మహా స్వాములవారితోబాటు పట్టాధికారము జరిగినది.

క్రీ.శ. 1948 సం॥లో కాశి పుణ్యక్షేత్రము జ్ఞానసింహాసన పట్టాధికారమును శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారికి శ్రీ మద్రంభాపురి జగద్గురువులవా రనుగ్రహించిరి.

వీరు శ్రీ మద్రంభాపురి జగద్గురువుల వారు శ్రీ ముక్తి మందిర ధర్మక్షేత్రములో 1950 సం॥మున జరిపిన చతురాచార్యుల సమ్మేళనము నకు విచ్చేసి గురు పీఠముల యొక్క ఐక్యతను బలపర్చిరి. తేది 11-5-1966లో శ్రీశైల సూర్య సింహాసనాధీశులు శ్రీ శ్రీ శ్రీ 1008 జ॥ వాగీశ పండితారాధ్యుల వారు తమ శాఖామఠమైన గుంతకల్లు పండితారాధ్య పీఠమునందు రజతోత్సవమును గురించి యేర్పరచిన చతురా చార్యుల సమ్మేళనములో పాల్గొనిరి.

మరల శ్రీమద్రంభాపురీ జగద్గురువులవారు శ్రీ ముక్తి మందిర ధర్మక్షేత్రములో నేర్పరచిన పంచాచార్యుల సమ్మేళనమునకు విచ్చేసిన భక్త జనులకు సద్ధర్మోపదేశమును జేసి ఆశీర్వదించిరి.

నేటికిని మధ్యప్రదేశమంతట ప్రజల కందరికి ధర్మోపదేశము జేయుచు భక్త సమూహమునకు జ్ఞానామృతము నుపదేశించి తృప్తిపరచు చున్నారు.



# శ్రీ జగద్గురు కేదారీ పీఠ పరిచయము

శ్రీ శివాగమోక్తి మేరకు పరమ శివుని తత్పురుషముఖోద్భవులై జ్యోతిర్లింగములందొకటియైన శ్రీ హిమవత్కేదార, ద్రాక్షారామ రామనాథలింగము మందావిర్భవించిన శ్రీ జగద్గురు ఏకోరామ శివాచార్యులు శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదితమైన వీరశైవ ధర్మతత్త్వమును దేశములో ప్రచారము జేయుటకై హిమవత్కేదారములో వైరాగ్య సింహాసనమును స్థాపించిరి.

ఈ పీఠము ఉత్తర ప్రదేశములోని చమోలి జిల్లా హిమాలయ పర్వతముపై కొన్ని వేల అడుగుల ఎత్తుమీద (పైన) నున్నది. పాండవుల అభిమన్యునికి పౌత్రుడైన (మునిమనుమడైన) జనమే జయ భూపాలుడు (తాను జీవించియున్న) తన కాలములో ఆనాటి ఈ వైరాగ్య పీఠాధీశులై యున్న జగద్గురు ఆనందలింగ జంగములను శివయోగులవారి సన్నిధియందు శ్రీ కేదార క్షేత్రమును దానముగా సమర్పించిన ఒక మహత్వ పూరితమైన దాన శాసనమును వ్రాయించి యిచ్చారు. ఇందులో యుధిష్ఠిర శకము 89వ ప్లవంగనామ సం॥ము అని వ్రాయబడినది. సుమారు 3 వేల ఒకవంద సం॥ము లకు పూర్వమున మహిమోపేతులైన "భూకుండలింగ" శివయోగీశ్వరులవారు కేదార పీఠమునలంకరించి యుండిరని గడవాలక ఐతిహ్యాము (చరిత్ర) అను గ్రంథమునుండి దెలియుచున్నది.

ఈ పీఠాధీశులు వేసవికాలములో మాత్రమే కేదార క్షేత్రమునందు నివసించుచుండిరి. శీతకాలములో మంచు వర్షమధికముగా బడుటచేత "ఉఖా" మఠమునకు విచ్చేసి నివసించుచుండిరి.

పూర్వ మొకప్పుడు అనిరుద్ధునిపత్నియైన "ఉషాదేవి" ఈ గురు పీఠమునందు నివసించి యీ మఠమును తన భక్తిమీర (గురుభక్తితో) నిర్మాణింపఁ జేసినది. ఆ కారణముచేత ఈ మఠము "ఉషామఠము" "ఉఖామఠము" అని బిలువబడు చున్నది.

ఈ పీఠమునధిరోహించిన మహాస్వాము లందరికి అక్కడి ప్రభుత్వము నుండి "రావల్" అను బిరుదు లభించి యున్నది. ఇది వంశ పరంపరగా వచ్చి యున్నది. చతుర్వర్ణములవారును మొదటి (పూర్వము) నుండియుః ఈ పీఠమునకు శిష్య ప్రశిష్యులగుటే గాకుండ 142 గ్రామములును జహగీరులును (అగ్రహారములు) నున్నవి. అంతేగాకుండ ఈ పీఠమునకు "ఉదయపూర్" "గ్వాలియర్" "టెహరి" "పాటియాల" "నేపాళ్" మున్నగు నగరములకు సంబంధించిన రాజులు, మహారాజులు, చక్రవర్తులు, వీరి వంశమువారు నేటికిని ప్రతి సం॥ము గురు భక్తితో కానుకలను సమర్పించుచున్నారు. ఈ పీఠాచార్యులు దేశ సంచారమునకు బయలుదేరి నపుడు 72 బిరుదావళులతో గూడిన యుత్సవమును దీసి తగిన రక్షక భటులను (పోలీసు సిబ్బందిని) శ్రీవారివెంటబంపి వారికేమాత్రము అపాయము గలుగకుండ జూచుకొనుటకై అలనాటి ప్రభుత్వము ఆజ్ఞాపించి యుండినది. తమ యధీనములోనున్న గ్రామములలోని సర్వ వర్ణముల ప్రజలపై దండించుట (శిక్షించుట) ఖండించుట, ప్రాయశ్చిత్తము జేయించుట శుద్ధి సంస్కారములను జరిపే అధికారమును బడసియున్నారు. ఈ పీఠమున పూర్వకాలపు రాజులు, మహారాజులు గురు భక్తితో సమర్పించి నట్టి భూదాన వర్షాచలము, దాన శాసనముల దాఖలాలు (ప్రమాణ పత్రములు) నేటికిని అనేకములున్నవి.

శ్రీ కేదార పీఠమునకు ప్రాచీన కాలము నుండి 291 మంది ఆచార్యులు పీఠాధీశులై యుండిరని ప్రాచీనాధారము (శాసనము) ల వలన

దెలియుచున్నది. ఇట్టి గురువంశ పరంపరలో అనేకమంది శివయోగీశ్వరులు మహిమాశాలురై వెలగి యున్నారు. ఈ పరంపరలో ఇటీవలి 290వ జగద్గురు విశ్వలింగ శివాచార్యులవారి సమయంలో ఆర్థిక ఇబ్బందికిలోనై సుమారు కొన్ని వేల రూ॥ల వరకు ఋణగ్రస్తులైన సమయమున శ్రీ మదుజ్జయిని సద్ధర్మ పీఠాధీశులు జగద్గురు సిద్ధలింగ శివాచార్య మహా స్వాములవారు ఈ శ్రీవారిని (మహాసన్నిధివి) తమ పీఠమునకు రప్పించుకొని లిం॥ వం॥ వే॥ కాశినాథశాస్త్రి గారితోబాటు కర్నాటకములో బర్యటించి ధన సహాయమొనర్చి వీరి కొదవిన ఆర్థిక ఇబ్బందిని దొలగించిరి. వీరు 1919వ ఇసివిలో బీదూరులో జరిగిన వీరశైవ మహాసభకు విచ్చేసి యా మహా కార్యమును నెరవేర్చి ఈ ప్రాంతమునందే బర్యటించుచు తేది 15-7-1921న ఉజ్జయిన్ పీఠమునందే శివైక్యమైరి.



# శ్రీ కేదార పీఠముయొక్క శేష పరిచయము

ఈ జగద్గురువులచేత వ్రాయబడిన "విల్" ననుసరించి నీలకంఠ లింగ శివాచార్యులవారు తేది 1-10-1921న శ్రీ కేదార పీఠముయొక్క 291వ జగద్గురు పీఠమునలంకరించిరి. వీరు ధారవాడ జిల్లా ''కల్లేదేవర'' అను గ్రామమునకు బృహన్మఠాధ్యక్షులైరి, వీరు పిన్నప్రాయముననే కాశీ క్షేత్రమునకువెళ్ళి విద్యాధ్యయనమొనర్చి కన్నడ, సంస్కృతము, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, పహాడి మున్నగు భాషలలో నేర్పుగలవారైరి. వ్యవహార కుశలురు, ఆయుర్వేద విద్యా విశారదులు అయి ఉండిరి, వీరు సౌందర్యము, సుదృఢ శరీరము గలవారై యుండిరి. మంచి వక్త, అలనాటి కాశీ పీఠాధిపతులైన జగద్గురు శివలింగ శివాచార్యులవారి ఆజ్ఞానుసారముగా కేదార పీఠమునకుబోయి పట్టాభిషిక్తులైరి, పండితులు తమ తమ సిబ్బందితోబాటు ఉత్తరప్రదేశము మరియు కర్నాటక ప్రాంతములందు బర్యటించి భక్తులకు ధర్మోపదేశము జేయుచు విపులమగు ధనరాసిని సంగ్రహించిరి. మఠమున కొసగిన ఋణమునుండి విముక్తిగావించుటే గాకుండ విపులమగు సువర్ణము, రజతము, రత్నాభరణములను ఆర్జించిరి. వీరు దేశపర్యటనము గావించు సమయమున హోసపేట, బళ్ళారి మున్నగు స్థలములందు సంస్కృత పాఠశాలలను స్థాపించిరి, మరియు తమ ఉషా మఠములోను ఆయుర్వేద విద్యాలయమును మరియు ఉన్నత పాఠశాలనుగూడ నెలకొల్పిరి. మరియు తమయొక్క సామ్రాజ్యపు పరిపాలనమును విస్తరింపజేసి, ఈ పరిపాలనము అతి సులభముగా జరుగుట కనుకూలమగు నట్లుగా ధారవాడ జిల్లా

తిమ్మాపురము పెద్దమఠం యొక్క గురువంశమునందు జన్మించినట్టి వే॥ శివమూర్తి శాస్త్రి గారికి తమ మఠమునకు చర పట్టాధికారము నను్రగహించి శ్రీ చిద్ఘనలింగ శివాచార్యులని నామకరణముజేసిరి. వీరు మహా జితేం ద్రియులై విద్యావంతులుగాను మరియు శాంత విగ్రహము గలవారై యుండిరి. విరు బహిర్గతమగు (మేల్విచారమును) సామ్రాజ్యపు పరిపాల నమును సరిజూచుకొనుచుండిరి. మరియు తమ సమస్త బిరుదావళులతో కర్నాటకము నందంతట బర్యటించివచ్చి స్వల్పకాలములోనే తేది 16-2-1942 లో శివైక్యులైరి. తరువాత శ్రీ జగద్గురు నీలకంఠలింగ శివాచార్యులవారే పీఠాధి కారమును నిర్వహించుచుండిరి. వీరుగూడ తేది 23-4-1945 లో లింగైక్యమైరి.

వీరి తరువాత శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు శ్రీ కేదారీనాథ రావల్, శాంతలింగ శివాచార్య మహా స్వాములవారు శ్రీ కేదార సుక్షేత్రము యొక్క ఊఖా (ఉషా) మఠమునకు తేది 10-6-1966 లో సదరి కమిటి సభ్యుల సమక్షమున నాటి శ్రీ కాశీజ్ఞాన పీఠాధీశులైన శ్రీ శ్రీ శ్రీ ౧౦౦౮ (1008) జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహా స్వాములవారు మరియు శ్రీమద్ రంభాపురీ వీర సింహాసనాధీశులైన శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు ప్రసన్న రేణుక వీరగంగాధర శివాచార్య భగవత్పాదులవారిచేత పీఠాధికారమును బడసి శ్రీ కేదార పుణ్యక్షేత్రము వైరాగ్య సింహాసనా ధీశులై యుండిరి.

ఈ మహాస్వాములవారు అధికారమును చేపట్టిన దాదిగా 20 సం॥లు అతి కష్టముపై తమ నాయకత్వమున అతి ధైర్యముతో పీఠమును జీర్ణో ద్ధారముగావించిరి. అంతేగాకుండ, పూర్వపు విద్యాలయములను పూజోత్స వాదులను వీడకుండ నిర్వహించుచుండిరి. దేశమంతట బర్యటించి

భక్తులకు ధర్మోపదేశమును జేయుచు పీఠముయొక్క కీర్తి ప్రతిష్ఠల నందినుమడింపజేసిరి. వీరును అచిరకాలములోనే లింగైక్యులైరి, వీరి స్థానమున జగద్గురు 1008 కాశీ పీఠాధీశులైన విశ్వేశ్వర శివాచార్యుల సంస్థానము యొక్క సమస్త బాధ్యతలను స్వీకరించి మరల మిగత నాల్గు పీఠాధీశుల సమక్షములో తమ జ్ఞాన పీఠ సంస్థానమందె యుండి సంస్కృతా ధ్యయనము జేయుచుండిన మరో యోగ్యులైన వటువుకు ఆ పీఠమునందు యథా శాస్త్రముగా వైభవోపేతముగా వైరాగ్య పీఠమునకు పట్టాభిషిక్తుల గావించి యున్నారు. వీరుగూడ జితేంద్రియులై పూర్వపు స్వాములవారి వలెనె సంస్థాన కార్యభారములను సక్రమముగా నెరవుచున్నారు.



# శ్రీశైల పీఠముయొక్క పరిచయము

శ్రీ శివాగమోక్తి మేరకు పరమ శివుని తత్పురుష ముఖోద్భవులై భారతదేశపు ద్వాదశ జ్యోతిర్లింగములలో ఒకటిదైన శ్రీశైల మల్లికార్జున జ్యోతిర్లింగమునుండి జగద్గురు పండితారాధ్యులవారు (పండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు) ఉద్భవించి శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదితమైన ధర్మ ప్రచారమునకై శ్రీశైల క్షేత్రములో సూర్య సింహాసన పీఠమును స్థాపించిరి.

నాటి నుండి ఈ పీఠమునకు అనేకానేక పీఠాధీశులై ఈ పీఠముయొక్క గొప్పదన (మహత్వ) మును అభివృద్ధి పరచుకొని ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర, తమిళనాడులలో, భక్తుల నధికసంఖ్యలో శిష్యులనుగా స్వీకరించి వీరశైవ ధర్మమును ప్రచారముగావించిరి. ఐతిహాసికముగా పూర్వములో గతించిన పీఠాధీశుల పరంపరలో ఒక క్రమపద్ధతిలో వీరి వంశ క్రమము (గురు పారంపర్యము) గా వారివారి పేర్లు లభ్యము గాకపోయినను కొన్ని పురాణ గ్రంధముల నుండియు మరియు ఇతర శాసనముల ఆధారమునుండియు కొందరు ఈ పీఠాచార్యులుగా పేర్కొనిన సంగతి దెలియుచున్నది. అనగా స్కాంద పురాణాంతర్గతమైన శంకర సంహితలో శ్రీశైలములో మహా శివయోగి యగు సుధానంద శివాచార్యులను జగద్గురువులవారు ఈ పీఠమునలంకరించి యుండిరని వ్యాస మహర్షులవారు ఆనతిచ్చియున్నారు. అందుచేత ఈ పీఠము ఎంతటి ప్రాచీనమైనదని వ్యక్తమగుచున్నది. క్రీ.శ. 940లో కృష్ణానది తీరాన వరెయూరు పట్టణమునకు ప్రభువైన "నన్నెచోడ" దేవుఁడను రాజా మహాకవిగా

ప్రసిద్ధిగాంచి ఆంధ్ర భాషలో "కుమార సంభవము"ను పద్యకావ్యమును రచించియున్నాడు. అందు తన వంశమునకు గురువైన శ్రీశైల పీఠాధిపతి యగు జంగమ మల్లికార్జున శివాచార్య మహాస్వాములవారి దివ్యసన్నిధిలో సమర్పించి (అంకితము) గావించి యున్నారు. ఈ గ్రంధ రాజమును రాజమహేంద్రనగర నివాసియైన సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులైన శ్రీమాన్ ఎం. రామకృష్ణ, ఎం.ఎ. గారు సమగ్రముగా పరిశోధించి ముద్రించి ప్రకటించి యున్నారు.

ఇటువంటి పీఠాధీశులవలన అలంకరించబడిన పంచపీఠముల చరిత్ర ఎంతటి ప్రాచీనమైనదని గోచరింపకమానదు. మరియు ఎంతటి మహత్వ పూర్ణమైనదో అనునది మనకు దెలియుచున్నది. ఈ శ్రీశైల పీఠము అప్పుడప్పుడు కష్టకార్పణ్యములకులోనై నైసర్గికముగా వర్షాకాల సొంత మక్కడ నివసించుటకు వీలులేని కతమున ఈ పీఠాచార్యులెల్లరు వేర్వేరు స్థలములలో నివాసమేర్పరచుకొనే సందర్భమేర్పడినది. ఈ కారణముచేత అప్పుడప్పుడు పీఠములయొక్క పాలనములో కొంతవరకు కొరత యేర్పడినది. ఈ విధమైన దుర్భర స్థితిలోనే పీఠాచార్యులై వచ్చినవారిలో జగద్గురు వాగలూటి భిక్షావృత్తి శివాచార్య మహాస్వాములవారు, శివపూజా ధురం ధరులు, తపోనిష్ఠులు అయి ప్రసిద్ధిజెందిరి. వీరు శివయోగ బలమువలన శ్రీ జగద్గురు నాగలూటి భిక్షావృత్తి శివాచార్య మహాస్వాములవారు సత్యశీలురై ఈ పీఠముయొక్క ఘనతను (మహత్వమును) గౌరవములను పరిరక్షించుచు 30-32 సం॥ములు ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర మొదలగు ప్రాంతములలో సంచరించి శిష్యోద్ధార కార్యక్రమమును నెరవేర్చిరి.

శ్రీ కాశీక్షేత్రము జ్ఞాన సింహాసనములో 1918 లో జరిగిన పంచాచార్య సమ్మేళనమునకు విచ్చేసి సమ్మేళనమును విజయవంతమొనర్చిరి.

వీరి పీఠముయొక్క వివాదములో విరోధులొడ్డిన విపత్తులను ధైర్యముతో ఎదుర్కొని తమ తపోబలముచేత వీరు పీఠముయొక్క కీర్తిని విస్తరింపం జేసిరి. తదుపరి వృద్ధాప్యముతో శక్తిహీనులైనప్పటికిని శ్రీ మదుజ్జయినీ పీఠాధీశులు శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు సిద్ధేశ్వర శివాచార్యులవారి సమ్ముఖమునందు తమ గుంతకల్లు మఠములో ముదేమారు బ్రహ్మరాధ్యశులైన పం॥ వాగీశ శివాచార్యులవారికి తేది 7-7-1940లో శాస్త్రోక్తముగా తమ ఉత్తరాధికారము నను గ్రహించిరి, పిదప తేది 31-7-1940లో శివైక్యులైరి.

ఈ విధముగా పట్టాధికారులైన శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు వాగీశపండితారాధ్య శివాచార్య మహాస్వాములవారు, కాశిలో సాహిత్య, వేదాంత, ఆయుర్వేద మున్నగు శాస్త్రములందు గొప్ప పాండిత్యము నార్జించుకొనుటేగాకుండ, ఆశు కవిత్వమునలవరచుకొని, శివపూజానందలోలురై మంచి వాక్పటుత్వమును, కన్నడ, తెలుఁగు, సంస్కృతభాషా పండితులై ప్రసిద్ధిగాంచిరి.

వీరు పీఠాధికారమును స్వీకరించిన పిదప పూర్వము పీఠమునకు విరోధులైనవారి సంక్షోభమును చాలా కాలము వరకు సివిల్‌కోర్టు, హైకోర్టుల వ్యవహారములందే నిమగ్నులై యుండిరి. అయినప్పటికి మహాస్వాములవారు వెనుకంజ వేయకుండ ధైర్యముతో నెదుర్కొని తమ తపోబలముతో కోర్టు వ్యవహారములన్నింటిని జయించి పీఠముయొక్క ఘనతను హెచ్చించిరి.

వీరు ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్రములందు సంచరించి భక్తులకు ధర్మోపదేశము గావించుచుండిరి. శ్రీశైల మల్లికార్జున దేవస్థానము

యొక్క అర్చనాధికారము మొదలైనవి వీరి స్వాధీనమునందే నుండెడివి. మహాశివరాత్రి పర్వదిన సందర్భమున వీరి (శ్రీవారి) అడ్డపల్లకి మహోత్సవము బహువైభవముతో నిర్వహించబడుచుండెడిది. శివరాత్రి మహోత్సవము కొరకు శ్రీశైల పుణ్యక్షేత్ర సందర్శనమునకై అచటకు విచ్చేయు యాత్రార్థులకు పుణ్యక్షేత్రములో మరియు ఆత్మకూర్‌లోని వీరి శాఖా మఠములోను ఉచిత భోజన వసతులను కల్పించి (సౌకర్యముల నేర్పరచి) లక్షలాది జనులకు దాసోహము (అన్నదానము) చేయుచుండిరి. ఆంధ్ర ప్రదేశములో ఉన్నత పాఠశాలలను నిర్వహించిరి. ఆత్మకూరులోను మరియు శ్రీశైలం పుణ్యక్షేత్రములోను యాత్రికుల వసతి సౌకర్యములకై భవ్య భవనములను గట్టించియున్నారు. మరొకటి "వాగీశ పండితారాధ్య విద్యాపీఠము" నొకదానిని నెలకొల్పి అచటి విద్యార్థులకు ఉచిత భోజన వసతి, అధ్యయనముల కల్పించియున్నారు. ఈ విద్యాపీఠముయొక్క పరీక్షకులు మరియు పర్యవేక్షకులుగా శ్రీ వే॥ పం॥ రాచవీర దేవర "తీర్థ" & M.O.L. గారు నియమింపబడ్డారు. ప్రతియేట యుగాది సందర్భమున శ్రీ జ॥ వారు వీరిని సభలో సన్మానించేవారు. గురుపీఠ మందిరమును నిర్మింపఁజేసి అందులో మూల జగద్గురు పండితారాధ్యులవారి లింగోద్భవ శిలామూర్తిని (విగ్రహాన్ని) ప్రతిష్ఠింపఁజేసి వీరశైవ సమాజము యొక్క ఘనతను ఇనుమడింపఁజేసి యున్నారు. తమకు పూర్వాశ్రమమగు హరిహర నగరములో ఆర్ట్సు సైన్సు కళాశాలను నిర్మించి నిర్వహించిరి. గుంతకల్లులోని తమ పీఠమునకు సంబంధించిన శాఖా మఠమును క్రొత్తగా భవ్యముగాను గట్టించి దాని శోభను పెంపొందించి యున్నారు. అంతే గాకుండ పాడుబడిన మఠమునకు చుట్టుప్రక్కలనున్న ఖాళీ స్థలములో జనులకు (భక్తులకు) ఆవాసయోగ్యమైన భవనములను గట్టించి ఆ పీఠము యొక్క ఆదాయమును హెచ్చించియున్నారు.

ఇట్లు కట్టడములన్నియు పూర్తి కాగానే తమ పీఠాధికారముయొక్క రజతోత్సవమును బహు వైభవముతో చతురాచార్యులనుగూడ రప్పించుకొని విద్వత్సభలను నిర్వహించి యీ సందర్భమున అక్కడికి విచ్చేసిన లక్షలాది భక్తులకు ధర్మోపదేశము నాశీర్వదించిరి.

ఈ పగిది నిరంతరము భక్తమండలి మరియు వీరశైవ సమాజము వారి, శ్రేయోభివృద్ధికిగాను శివపూజా తపోబలము గలవారై అసంఖ్యాక సౌకర్యములను గలిగింపజేసి శాశ్వతకీర్తి ప్రతిష్ఠలను బడసిరి.

వీరు లింగైక్యులుగాక పూర్వమే తమ అంతిమ సమయములో పీఠమునకు దగినట్లుగా ప్రకాండ విద్వాంసులైన జ॥ 1008 శ్రీ ఉమా పండితారాధ్యులవారికి మిగత చతురాచార్యుల సమ్ముఖమున వైభవోపేతముగా పట్టాభిషిక్తులను గావించి తాము దావణగెరి నగరంలో తమ శాఖ మఠములో లింగైక్యులైనారు.



# శ్రీ కాశీపీఠముయొక్క పరిచయము

శ్రీ శివాగమోక్త ప్రకారముగ పరమ శివుని ఈశాన్య ముఖోద్భవులై భారతదేశమందలి జ్యోతిర్లింగములలో ఒకటిదైన శ్రీ కాశి పుణ్యక్షేత్రము విశ్వనాథ జ్యోతిర్లింగము నుండి శ్రీ జగద్గురు 1008 విశ్వారాధ్య శివాచార్యులవారు ఆవిర్భవించి శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదితమగు వీరశైవ ధర్మమును దేశములో ప్రచారమొనర్చుటకై కాశి క్షేత్రమున జ్ఞాన సింహాసన పీఠమును స్థాపించిరి.

ఈ పీఠము కాశిలో నున్న అతి ప్రాచీన స్మారకములతో నొప్పారుచున్నది. సత్య హరిశ్చంద్రుని పుత్రుడైన లోహితాస్యునకు ఏ స్థలమునందైతె సర్పదష్టమై యుండెనో ఆ స్థలము ఈ పీఠమునకు స్వాధీనమై యున్నది. ఈ పీఠము శివలింగములతో నిండియుండినది.

ఇంతేగాకుండ కాశి నరేశుడైన "జయనందదేవుఁడు" శ్రీ జగద్గురు విశ్వారాధ్య సింహాసనమునలంకరించియుండిన శ్రీ మల్లికార్జున శివాచార్య మహాస్వాములవారికి విక్రమ నామ సం॥ర క్రీ॥ శ॥ 574లో గంగానదీ తీరమందు కొంత భూమిని దానరూపమున సమర్పించి యున్నాడు. ఈ దానవ్రతము తామ్ర శాసనము నేటికిని పీఠము నందుండుటచేత ఉత్తర ప్రదేశపు ప్రభుత్వ మంగీకరించి యున్నది. దీనితోబాటు పూర్వకాలపు రాజ మహారాజులు మరియు మొగలు చక్రవర్తులు ప్రసిద్ధిగాంచిన హుమాయూను, అక్బరు, జహాంగీర్, షహజాన్, ఔరంగజేబు, మహమ్మద్‌షా వీరందరు నిజమైనవేయని హైకోర్టు తీర్పు ఇవ్వడముచేత

అందరంగీకరించవల్సిన విషయమే యనుటలో నెలాంటి సంశయమున కాస్పదములేదు. పూర్వపు మన మైసూరు మహారాజా లందరు ఈ పీఠమునకు దానముగా సమర్పించిన దాన శాసనముగూడ ఒకటున్నది. ఇదే మఠములోనున్న అతి ప్రాచీన శిలాశాసనము మరియు తామ్ర శాసనములతో గూడియున్నందున ఈ పీఠము చాలా పురాతనమైనదనుట నిర్వివాదాంశము.

ఇట్టి పురాతన పీఠమునందుండి గతించిన పీఠాధీశుల పారంపర్యము క్రమబద్ధమైనదిగా నుండి నదిలభింపమి ప్రస్తుతము లభించిన అధారము లనుబట్టి 85మంది పీఠాధిపతులను గుర్తించిన దాఖలాలున్నవి.

ఈ గురు పరంపరలో 81వ జగద్గురు రాజేశ్వర శివాచార్య మహాస్వాములు, వీరు శివయోగ సంపన్నులు ఘన(గొప్ప) విద్వాంసులు, శాపానుగ్రహ (నిగ్రహానుగ్రహ) సమర్థులు అయినందున వీరు జగద్వంద్యులై యొప్పిరి. వీరు తమ తపోబలముచేత ఆనాటి శివయోగుల సమూహంలో అగ్రస్థానమును బడసి యుండిరి. 1911 లో పంచమజార్జి గారి పట్టాభిషేక శుభ సమయమునందు భారతదేశమునందె సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమని గణుతికెక్కిన శ్రీ కాశి పుణ్యక్షేత్రమందు ఒక ప్రఖ్యాతిగాంచిన యోగి మహోత్సవాన్ని నిర్వహించవలెనని యెంచి భారత ప్రభుత్వము నిర్ణయించి యుండినది. అప్పుడు భారత ప్రభుత్వము ప్రార్థనమేరకు శ్రీజగద్గురు రాజేశ్వర శివాచార్య మహాస్వాములవారె ఇందుకర్హులుగా భావించి (తీర్మానించి) వీరి మహోత్సవాన్ని అత్యంత వైభవముతో నిర్వహించిరి. ఇది సమస్త వీరశైవ సమాజమునకే అసాధారణమైన గౌరవ ప్రతిష్ఠల నాపాదింపజేసిన విషయమై యున్నది.

వీరి తరువాత 82వ జగద్గురు శివలింగ శివాచార్యులు ఈ జ్ఞాన పీఠమునకు పట్టాధికారులైరి. వీరు తర్కశాస్త్రములలో నద్వితీయ

పండితులై యుండిరి. తమ బుద్ధికుశలతతో మహా పీఠమును అభివృద్ధి పరచిరి. తమ జంగమవాడి మఠములోనే దక్షిణదేశము నుండి వేంచేసిన వీరశైవ విద్యార్థులందరికి ఆశ్రయమొసంగి, వారికుచిత భోజన వసతుల నేర్పరచి ఎంతో యభిమానముతో సంస్కృత విద్యాభ్యాసమును జేయించు చుండిరి.

దీనితో వీరశైవ విద్యార్థుల ప్రౌఢ సంస్కృత విద్యాభ్యాసమునకు ఈ జ్ఞానపీఠము కేంద్రముగా పరిఢవిల్లినది. ఇక్కడ సంస్కృత ప్రౌఢ విద్యాభ్యాసమును పూర్తిజేసిన అనేకానేక విద్యార్థులు పూజ్య గురు పీఠములకు జగద్గురులైరి. వారిలో మరికొందరు విరక్త మఠముల కధిపతులైరి, మరికొందరు గొప్ప వేద పండితులు, శాస్త్రవేత్తలు, కవి పుంగవులు, శివ కీర్తనకారులు, సంగీత శాస్త్రజ్ఞులు, కళా వేత్తలుగా విలసిల్లిరి. వీరిద్వారా విపులముగా వీరశైవధర్మ ప్రచారము జరుగుటవలన భారతదేశపు నలుదిశలలో వీరశైవ ధర్మము వ్యాప్తిజెంది వీరశైవులు సర్మధర్మంముల కంటెను ఉచ్ఛ్రాయస్థితిలో నుండిరి. ఈ పండిత ప్రకాండుల యెదుట వాదవివాదములలో ఎదుటిపండితు లెందరో పరా జయము నొందిరి.

ఈ పీఠాచార్యులు 1918లో పంచ పీఠాధీశులను తమ జ్ఞానపీఠము నకు రప్పించుకొని ధర్మసమ్మేళనమొనర్చి సమాజోద్ధారమునకు కారణకర్త లైరి. ఈ పీఠమునకు నేటికిని జంగమవాడి మఠమని ప్రఖ్యాతిగాంచి వీరశైవ యాత్రికులకు మాతృగృహము మాదిరిగా నున్నది. ఈ మహా స్వాములవారు 30 సం॥ ముల వరకు పీఠమువలంకరించి అవసానదశ ప్రాప్తించగా శ్రీ పంచాక్షర శివాచార్యులవారికి పీఠాధికారమునను గ్రహించిరి. వీరు క్రీ.శ. 21-4-1952లో లింగైక్యులైరి.

ఈ విధముగ 82వ పట్టాధ్యక్షులైన జగద్గురు పంచాక్షర శివాచార్యులవారు పూర్వమునుండి జంగమ్మవాడి మఠమునందే ఉండి సంస్కృత విద్యాభ్యాసమొనర్చి యనేక పరీక్షలలో ఉత్తీర్ణతనందిరి. మరియు ఆచార విచారములందును నిష్ఠగలవారై శివయోగమునందాసక్తిగలిగి సద్గుణ సంపన్నులై యుండిరి. వీరు విద్యార్థుల శ్రేయోభివృద్ధికి చాలా శ్రమించిరి. వీరు 12 సం॥ములు పరిపాలన యొనర్చి దేహావసానము ప్రాప్తించగా ఇదే పీఠాశ్రమమందుండి విద్యార్జనమొనర్చి గొప్ప పాండిత్యముగలవారై నైష్ఠిక బ్రహ్మచారులు, కులశీలాది సద్గుణ సంపన్నులు అయిన నాటి నైజాంస్టేటు (నేడు ఆంధ్రప్రదేశమున)కు చెందియున్న నల్లగొండజిల్లా చిదిరె గ్రామము మఠాధికారియైన పండిత వే॥ వీరభద్రశాస్త్రిగారిని తమ పీఠమునకు ఉత్తరాధికారి యగుటకు యోగ్యులుగా భావించి యెన్నుకొని వారి పేరిట ఒక విల్ను (దస్తావేజును) వ్రాయించి తేది 28-4-1944లో శివైక్యమందిరి.

ఈ ప్రకారముగా పీఠాధీశులుగా నెన్నుకొనబడిన పండిత వే॥ వీరభద్రశాస్త్రిగారు నిసర్గము (సహజము) బాలకవియై తరువాత సకలశాస్త్ర పారంగతులై కావ్యతీర్థ, వేదతీర్థ, స్మృతి తీర్థ, సాంఖ్యతీర్థ, సర్వదర్శనతీర్థ మొదలగు గొప్పగొప్ప పరీక్షలందు ఉత్తీర్ణులగుటేగాకుండ ఆనాటి దేశములోని మహా పండితులచేత విద్యానిధి, విద్యా వాచస్పతి మున్నగు బిరుదములను బడసియుండిరి. వారు కన్నడ, ఇంగ్లీషు, తెలుగు, మరాఠి మొదలగు భాషలందును ప్రావీణ్యతను బొందియుండిరి. ఈ సమస్త భాషలందును నిరర్గళముగా నుపన్యసించుచుండిరి, లోకవంద్యులైరి, ప్రాచీన శాసనములను బఠించుటలో అద్భుతమైన పాండిత్యము నార్జించియుండిరి. మరియు అశోకుని కాలములోని శాసన లిపిని సులభముగా జదువుచుండిరి. వీరు తమ పాండిత్యమునకు దగినట్లుగానె ధైర్యసాహసము మొదలగు గుణములకు ప్రోవ (నిలయమై)యై యుండిరి.

తరువాత వీరు నేపాలు ప్రాంతమును సందర్శించి ఆ పరిసర ప్రాంతములందుండిన గంగోత్రి, యమునోత్రి, కేదారనాథ, బదరీనాథ, పశుపతినాథ మొదలగు తీర్థయాత్రలను జాట్టివచ్చి సికింద్రాబాదు పట్టణములోని శ్రీ మటిగె నాగయ్యగారి ధర్మసత్రము గురుకులము నొకదానిని నెలకొల్పి అందుండే "విభూతి" యను నొక తెలుగు వీరశైవ ధర్మ మాస పత్రికను ప్రకటించి (వెలువరించి) తద్వారా వీరశైవ ధర్మ సంస్థాపకులైన జగద్గురు పంచాచార్యుల పవిత్ర సిద్ధాంతములను తెలుగు దేశమందంతటను ప్రచారమొనర్చుచు విద్యా-సంస్కృతి శివధర్మమునకు సంబంధించిన పంచాచార్యుల ప్రభావములను విశ్వతో ముఖముగా వ్యాపింపఁ జేసిరి. శైవధర్మ గ్రంథములను, లేఖలను ఆంధ్రము, ఇంగ్లీషు, భాష లలో వ్రాసి ఆంధ్రదేశముయొక్క "శైవభారతి భవన"మను గ్రంథాలయాన్ని స్థాపించిరి. ఈ విధముగా తమ విద్వత్ ప్రౌఢిమచేత తమదేయైన వీరశైవసమాజము మరియు దేశోద్ధారక కార్యక్రమములను రూపొం దించుకొను చుండిరి. కాని వీరిలో నెలాంటి స్వాభిమాన మనునది లేకుండెను.

తేది 27-9-1944లో శ్రీ మద్రంభాపురి జగద్గురువుల వారిచేత శ్రీ కాశి పుణ్యక్షేత్రమువంటి దానికి సుప్రసిద్ధులైన వీరు జ్ఞాన సింహాసన పీఠమునకు పట్టాధికారమును బడసి 84వ పట్టాధీశులై శ్రీ శ్రీ శ్రీ 1008 జగద్గురు వీరభద్ర శివాచార్య భగవత్పాదులని బిలువబడు చుండిరి.

వీరు పట్టాధికారమును జేపట్టినబిదప పంచపీఠముల స్థితిగతులపై మిగుల శ్రద్ధ వహించి వాడు బొత్తిగా పేద స్థితిలోనున్న కేదారపీఠమునకు ధనసాయమొసగి దానియొక్క దుస్థితిని బోకార్చిరి. సమాజమును సుధా రించుటకై (తీర్చిదిద్దుటకై) ఉత్తమ వీరశైవ గ్రంథములఁ బ్రకటించి,

విద్వాంసులచేత ప్రాచీన గ్రంథ పరిశోధనములం గావింపజేసి నిజమైన ధర్మ చరిత్ర నిర్మాణము వీరశైవ విశ్వకోశము (నిఘంటువు)యొక్క సంకలనము, ధార్మిక మహాసభ, యోగాశ్రమ గురుకులాముస్థాపనము మొదలగు మహత్వ పూరితములైన కార్యక్రమములను నిర్వహింపవలెనను సత్సంకల్పం వారిలో నుండెడిది. హతభాగ్యులైన వీరశైవుల దురదృష్టమువలన వీరికి దేహావసానము ప్రాప్తించి కేవలము నాలుగు సం॥ములు మాత్రమే జ్ఞాన సింహాసనమును రంజింపజేసి తేది 25 జనవరి 1948 తమయొక్క 40 సం॥ల ప్రాయముననే శివైక్యులైరి.

వీరు తమ అంత్య సమయమందు ధారవాడ జిల్లాకు సంబంధించిన హిరేకేరూరు తాలూక మదగ మాసనూరు గ్రామముయొక్క హిరే మఠ (పెద్దమఠ) మునకు సంబంధించిన శ్రీ విశ్వేశ్వర శివాచార్య ఉర్ఫ జయగురు శివాచార్యులను వారిని తమ పీఠమునకు ఉత్తరాధికారిగా నెన్నుకొని (గుర్తించి) మరణశాసనమును వ్రాసిరి రిజిష్టర్ జేయించి యుంచిరి.

ఇదే ప్రకారముగా శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారు క్రీ.శ. 1870వ సర్వధారి నామ సం॥ము కార్తీకశుద్ధ 13వ శుభముహూర్తమున శ్రీ మద్రంభాపురీ జగద్గురు శ్రీ శ్రీ శ్రీ 1008 ప్రసన్న రేణుక వీరగంగాధర శివాచార్య మహా స్వాములవారిచేత ఈ జ్ఞాన సింహాసనమునధిష్ఠించినవారై అధికారమును స్వీకరించి 85వ జ్ఞానపీఠాధీశులైరి.

వీరు తమ పీఠాశ్రయములోనే విద్యార్జనమొనర్చి కన్నడ, సంస్కృత విద్యా విశారదులై గురుత్వ శోభిత సకల సద్గుణములతో గూడినవారై పీఠము యొక్కయు మరియు వీరశైవ సమాజము యొక్కయు అభివృద్ధి కొరకు పాటుబడుతు శ్రమించిరి. పూర్వపు జగద్గురువుల సంకల్పము మేరకు వారి సమస్త కార్యక్రమములను నిరాటంకముగా నెరవేర్చుచుండిరి.

పంచ మహా పీఠములప్పుడప్పుడు ఒకచో గూడుకొని సమాజాభివృద్ధి కార్య క్రమములను నిర్వహించుటకు అనేక కార్యక్రమములను రూపొందించి వాటిని ఆచరణలోకి దెచ్చిరి.

వీరు తమ తమ ప్రాంతములలోను మరియు కర్నాటకాంధ్ర మహా రాష్ట్రములలోను బర్యటించి ధర్మోపదేశము జేయుచు పంచ మహా పీఠముల యొక్క మహాత్మ్యమును ప్రకటించుచున్నారు. పూనా నగరము మున్నగు పట్టణములలో విద్యార్థులకు ఉచిత భోజన వసతి సౌకర్యములను నిర్వహించిరి. తమపీఠము యొక్క కట్టడాలను జీర్ణోద్ధారము గావించి శాశ్వతపరచి యున్నారు. అంతేగాకుండ భక్తా మహేశ్వరు లందరికి సంపూర్ణమైన సంతృప్తి నొసగి యున్నారు.

శ్రీ జగద్గురు 1008 విశ్వేశ్వర శివాచార్య మహా స్వాములవారు ది. 2-10-1989 సోమవారం జంగమవాడి మఠశాఖామఠమైన పూనాలో తమ పార్థివ శరీరాన్ని వీడి శివైక్యులైరి.

ఇలహాబాదు (దారాగుజ) పూనా, నేపాల్ ప్రాంతములలో అక్కడక్కడ జంగమవాడి శాఖామఠములున్నవి. మరికొన్ని చోట్ల ప్రోత్సహించి తమ శిష్యులచే కొన్ని ధార్మిక సంస్థలను నెలకొల్పియున్నారు. శ్రీ విశ్వేశ్వర శివాచార్యులవారు గురు విరక్తులనే భేదభావమును పాటించకుండ వీరి ఉభయుల అభివృద్ధికై బాటుబడుతు 1984లో వీరశైవ అధ్యయన పీఠమును (శక్తి విశిష్టాద్వైత వేదాంత) సంపూర్ణానంద సంస్కృత విశ్వ విద్యాలయములో ప్రారంభించిరి. వీరశైవ మఠాధీశులవగారు సాధకులందరికి కాశి మఠములో సకల సౌకర్యములను గల్పించి యున్నారు. ఈ ఘన కార్యమును నిర్విఘ్నముగా కొనసాగించుటకై అందుకు సమర్థులైన

ష. బ్ర. డా॥ చంద్రశేఖరశి వాచార్యులు అమరేశ్వర మఠము గుళేదగుడ్డ గారు మార్గ దర్శకులుగా నియుక్తులై యున్నారు.

శ్రీ జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు తమ జీవితములో ఎన్నడును స్వార్థమునకు లోనుగాక ఎల్లప్పుడు పరార్థమునకు మరియు ధర్మాభివృద్ధికై, సమాజాభివృద్ధికి, భక్తులయొక్క కల్యాణమునకుగాను తమ జీవితమును అగరుబత్తిలాగ, సిఖి కర్పూరమువలె, గంధపుచెక్క మాదిరి, అరగదీసిన సుగంధమును విరజిమ్మిరి. ఆశ ఆకాంక్షలకు దూరముగానుండిరి. సిద్ధాంత శిఖామణి లింగధారణ చంద్రిక వంటి వీరశైవ ధర్మమునకు మూల సిద్ధాంత గ్రంథములను తెలుగు, కన్నడ, మరాఠీలలో పునర్ముద్రించిరి. తాము సదా ఏవేవో కార్యక్రమములందే నిరతులై యుండి పూజ్యపాదులు తమ 72 సం॥ము ల వయసులో శివైక్యమైరి.

ఇట్లు లింగైక్యులైన జగద్గురు 1008 కాశి విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారి కృపకు పాత్రులై అమంగు శిష్యులైన శ్రీ ష. బ్ర. డా॥ చంద్రశేఖర శివాచార్య స్వాములవారు కాశి విశ్వారాధ్య జ్ఞాన సింహాసనమునకు నూతనముగా జగద్గురువులుగా మిగత చతురాచార్యుల సమ్ముఖమున శాస్త్రోక్తముగా పట్టాభిషిక్తులై యున్నారు. ఈ పట్టాభిషేక శుభ సందర్భమున శ్రీ మద్రంభాపురి, శ్రీ మదుజ్జయినీ, శ్రీమత్కేదారము మరియు శ్రీశైల జగద్గురువులు వేంచేయుటే గాకుండ కర్నాటకాంధ్ర మహారాష్ట్ర ప్రాంతములనుండి అనేకానేక సద్భక్తులు వచ్చి యుండిరి.

నూతన జగద్గురువులైన డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాములవారు కాశియందె 20 సం॥ము లుండి సంస్కృతాధ్యయనము జేయు

చుండిరి. శ్రీవారు వేదాంతాచార్య (ఎం.ఎ.) మరియు విద్యావారిధి (పి.హెచ్.డి.) పట్టములను సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయము నుండి బొందియున్నారు. ఇంతెగాకుండ వారు అనేకానేక పరీక్షలలో నుత్తీర్ణులైనారు. పశ్చిమ బెంగాల్ మరియు కేంద్రప్రభుత్వము నుండి నిర్వహింపబడిన సంస్కృత చర్చలలోబాల్గొని ప్రథమశ్రేణి నార్జించి స్వర్ణ పతకముల నందుకొన్నారు. దేశపర్యటన గావించి వీరశైవ ధర్మ ప్రచారమొనర్చిరి.



# అభినందన సమారంభము

నూతనముగా కాశీ జ్ఞాన సింహాసనమున పట్టాభిషిక్తులైన డా॥ చంద్రశేఖర శివాచార్య మహాస్వాములవారి అభినందన సమారంభము సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయ పరిసరము (ప్రాంగణము)నందు వారాణసి సమస్త పండితుల సమక్షములో ఇటీవల అత్యంత వైభవముగా జరిగినది. ఈ సందర్భమున కేంద్ర ప్రభుత్వ సహాయ సహకారముతో ప్రకటింపబడిన శ్రీ జగద్గురువులవారి పరిశోధనా ప్రబంధమైన "సిద్ధాంత శిఖామణి సమీక్షా" గ్రంథముయొక్క ఆవిష్కరణము భూత పూర్వపు కులపతి శ్రీ కరుణాపతి త్రిపాఠిగారు నిర్వహించిరి. వేదాంత విభాగమున కుప్రాచార్యులైన శ్రీ పారసనాథ ద్వివేదిగారు శ్రీ జంగమవాడి మఠము యొక్క పారంపర్యమును మరియు నూతన జ॥ వుల జీవితము మరియు ఆదర్శము నభివ్యక్తముజేయు ఛందోబద్ధమై సంస్కృతములో రచింపబడిన అభినందన పత్రమును బఠించి సకల పండితుల పక్షమున పూజ్య జగద్గురువులవారికి సమర్పించిరి. తరువాత కొందరు పండితులు శ్రీవారు జంగమవాడి మఠముయొక్క గొప్పదనము (మహత్వము) గౌరవమును కాపాడుకొని పోవుటతోబాటు ధర్మము, శిక్షణ, సంస్కృతి మరియు సంస్కృతముల ఉద్ధారమునకై శ్రద్ధ వహించగలరని తమ ఆశయమును వ్యక్తపరచిరి. అందుకు శ్రీవారు కాశీపండితుల అండ-దండలతో జ్ఞానాభివృద్ధి కార్యక్రమములను జేపట్టుటే గాకుండ పూర్వపు జగద్గురువులచేత స్థాపించబడిన "వీరశైవ అనుసంధాన సంస్థ" ద్వారా విధాయక కార్యములను కొనసాగించగలమని ఆశీర్వాదరూపమున ఆశ్వాసనమొసంగిరి.



# నూతన జగద్గురువుల సంక్షిప్త చరిత్ర

పరమ పూజ్యులైన నూతనముగా కాశి జ్ఞాన సింహాసనాధిష్ఠితులైన శ్రీ డా॥ చంద్రశేఖర శివాచార్య మహా స్వాములవారు బిజాపూరు జిల్లా, తాలూక తొగుణసి గ్రామమున 15-8-1950లో పురాణ మఠము శ్రీ వే॥ సిద్దయ్యగారు మరియు సౌ॥ సావిత్రమ్మగారు ఈ పవిత్ర దంపతుల గర్భ శుక్తిక యందు జాతిముత్యమువలె జన్మించిరి. సంస్కృత పండితులు మరియు ప్రవచన పటుత్వముగల శ్రీ వే॥ వీరూపాక్ష శాస్త్రి గారు వీరికి తాతగారు. సుశిక్షితులు మరియు సౌశీలవంశమున జన్మించిన వీరు తమ ప్రాథమిక శిక్షణమును తొగుణసి మరియు బ్యాడగియందు పూర్తిగావించి గుళేదగుడ్డలో మాధ్యమిక శిక్షణనుగూడ బడసిరి. వీరి నైపుణ్యత మరియు సాత్విక వర్తనకు ఆకర్షితులైన కొటికల్, గుళేదగుడ్డయొక్క అమరేశ్వర బృహన్మఠాధ్యక్షులైన పూజ్య శ్రీ అమరేశ్వర మహా స్వాములవారు 1963లో వీరిని తమ మఠమునకుత్తరాధికారిగా నియమించిరి. ముందు సంస్కృత విద్యాధ్యయనమునకు వీరిని సోలాపురమునకు బంపిరి. అక్కడ శ్రీ మద్వీరశైవ గురుకులము (హోటగిమఠ) మరియు వారద సంస్కృత పాఠశాలలో 6 సం॥ముల వరకు సంస్కృతాధ్యయనముజేసిన శ్రీవారు కలకత్త "కావ్యతీర్థ" పరీక్షలో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణతనందిరి. శ్రీ అమరేశ్వర స్వాములవారు లిం॥ అయిన బిదప 1970వ సం॥లో కలఘటి 12 మఠముయొక్క శ్రీ ష. బ్ర. మడివాళ శివాచార్యులచేత పట్టాభిషిక్తులై శ్రీ అమరేశ్వర మఠముయొక్క బాధ్యతలను వహించిరి. వీరిలోని విద్యాభిరుచిని పసిగట్టిన భక్తులు ప్రౌఢవిద్యా వ్యాసంగమునకై వీరిని కాశికి బంపిరి.

కాశి జంగమవాడి మఠమునందేయుండి అధ్యయనమును కొనసాగించిన శ్రీవారు తమ ప్రతిభను మరియు నిరంతర కృషి ఫలితముగా కాశి విద్వాంసుల హృదయములను చూరగొనిరి. కాశి సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయము విద్యార్థియైన పూజ్య శ్రీవారు అక్కడ "వేదాంతాచార్య" పరీక్షయందు ప్రప్రథమముగా మొదటివారి గుణములను (శ్రేయాంకములను) బొందిరి. ఏ తత్ఫలితముగా మూఁడు స్వర్ణపతకములను స్వాయత్త పరచుకొనిరి. ముందు విశ్వవిద్యాలయములో సంశోధనా కార్యక్రమమును జేపట్టి 1981 సం॥లో "విద్యావారధి" పి.హెచ్.డి. పట్టభద్రులైరి. ఈ మధ్య 1970లో కేరళలో గురువాయూరులోను మరియు 1971లోను క్రొత్తఢిల్లీయందు నిర్వహింపఁబడిన అఖిలభారత సంస్కృత భాషణ (ఉపన్యాసము) వక్తృత్వ పోటీలలో ఉత్తరప్రదేశ ప్రతినిధిగా నుండి ప్రథమ స్థానమును బడసి, కేంద్ర ప్రభుత్వము నుండి పురస్కృతు (సన్మానింపబడిరి) లైరి. వీరు తమయొక్క ప్రతిభా సామర్థ్యముతో విశ్వవిద్యాలయ "అను దాన ఆయోగము" యు.జి.సి. నుండి సర్వోన్నతమైన శిష్యవేతనమును బొంది "విద్యావాచస్పతి" ఉపాధికొరకు "వీరశైవ తత్త్వత్రయ విమర్శ" అను విషయముపై ప్రబంధము నొకదానిని అదే సంస్కృత విద్యాలయమున సిద్ధాంతీకరించి (మండించి) యున్నారు. నికట భవిష్యమునందే ఆ ఉపాధి వీరికి లభించనున్నది. "సర్వదర్శనతీర్థ" పరీక్షలో సర్వోన్నత స్థానమును బడసిన వీరు పశ్చిమబంగాల ప్రభుత్వము యొక్క " కుమార శరదిందు నారాయణ స్వర్ణపదకము"నుండి సన్మానింపబడిరి.

పరమ పూజ్యుల సాహిత్యసేవగూడ చాల హర్షింపదగినదిగా నున్నది. "వీరశైవ పంచపీఠ పరంపరే" అను ఐతిహాసిక ఆధారములతోగూడిన పరిశోధనాత్మకమైన కన్నడగ్రంథముతో బాటు "వీరశైవ అష్టావర్ణ

విజ్ఞాన"మను గ్రంథమును మరాఠీ మరియు హిందిలోను ప్రకటించబడినది. ఇది యిప్పుడు కన్నడ, తెలుగు, ఆంగ్ల భాషలలో అనువాదమును సంతరించుకొన్నది. ముద్రణములకు సంసిద్ధముగా నున్నది. ఇంతేగాకుండ లఘుపుస్తకములెన్నో ప్రకాశింపబడినవి. సంస్కృతము మరియు హింది పత్రికలందు వీరి యనేక సంశోధనాత్మకములైన లేఖలు ప్రకటింపబడినవి. ఇటీవల కేంద్ర ప్రభుత్వము సహాయ సహకార (అను దానము) ములతో ప్రకటింపబడిన "సిద్ధాంత శిఖామణి సమీక్ష" అనునది ఉత్కృష్టమైన సంస్కృత గ్రంథము అవిష్కరింపఁబడి విశ్వవిద్యాలయములో పాఠ్య గ్రంథముగా స్వీకరించబడినది. ఇది విశేషముగా సంతోషదాయకమైన విషయము. వీరి మార్గదర్శనమున "జంగమవాడి మఠముయొక్క" "శైవ భారతి భవనము" అను ప్రకాశక సంస్థనుండి "లింగధారణ చంద్రికా" మొదలగు ప్రకాండ గ్రంథ రాజములు ప్రకటింపఁబడినవి. సమస్త మానవ జనాంగమునకుపయుక్తమైన "సిద్ధాంత శిఖామణి" యొక్క వందలాది లఘుపోత్తములను వెలువరింపజేయవలెనను వీరి సత్సంకల్పము 9 గ్రంథముల రూపమున ఇప్పటికప్పుడే ప్రకాశింపబడినవి. ఇవి అధిక జనాకర్షితములై యున్నవి.

నిరంతరము సాహిత్యకృషిని కొనసాగించుచున్న శ్రీవారు ధర్మ ప్రచారమునందు సిద్ధహస్తులు. కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతములందంతట బర్యటించి వీరు వీరశైవధర్మ సౌరభమును వ్యాపింపజేసి యున్నారు. వీరి యపారమైన విద్వత్తు, కార్యదక్షత మరియు ప్రయత్నశీలత వీరిని జనప్రియులుగా జేసి యున్నవి.

కాశీ జంగమవాడి మఠముయొక్క 85వ జగద్గురువులై యుండిన శ్రీ 1008 విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు లింగైక్యులైన

తిరువాత వారి అంతిమ కోరికమేరకు మిగత నాలుగు మంది పీఠాచార్యులు తేది 17-11-1989న అసంఖ్యాక భక్తుల సమక్షమంలో శ్రీవారికి పట్టాభిషేకమును గావించి వీరిని శ్రీ విశ్వారాధ్య జ్ఞాన పీఠమునకు 86వ పీఠాచార్యులుగా ఉద్ఘోషించి శ్రీ పీఠముయొక్క బాధ్యతలను అప్పగించి యున్నారు.

ఇట్లు తమ పట్టాభిషేకము తరువాత జ్ఞాన పీఠముయొక్క భవ్య పారంపర్యమును నిర్విఘ్నముగా కొనసాగించుటకు భక్తజనులకు ఆశ్వాసనము నొసంగియున్నారు. మరియు కొన్ని మహత్వపూరితములైన పథకములను వేసికొని యున్నారు.



# జగద్గురు రంభాపురి వీర సింహాసనాధీశులు ప్రస్తుతములో వున్న ప్రసన్న రేణుక వీర రుద్రముని శివాచార్య మహా స్వాములవారి శేష చరిత్రము

తేది 15 మే 1972 రంభాపురి వీర సింహాసనమున పట్టాభిషిక్తులైన జగద్గురు 1008 శ్రీ వీర రుద్రముని శివాచార్య మహా స్వాములవారు 20 సం॥ములు కాశి పుణ్యక్షేత్రమునందుండి సాహిత్యాచార్య, మీమాంసాచార్య, న్యాయశాస్త్రాదులలో పట్టభద్రులైనారు.

హిందిలో ఎం. ఏ. స్నాతకోత్తర పదవిని బొంది "విద్యావాచస్పతి" అను బిరుదాన్ని అలంకరించి యున్నారు. మరాఠి, సంస్కృతాంగ్ల భాషలలోను కోవిదులై యున్నారు.

ఇ. 1972 మే 15 ఇటీవలె లింగైక్యమైన శ్రీ జగద్గురు వీర గంగాధర శివాచార్య మహా స్వాములవారి తరువాత రంభాపురి వీర సింహాసనమున పట్టాభిషిక్తులైన శ్రీ జగద్గురు ప్రసన్నరేణుక వీర రుద్రముని శివాచార్యులవారు 120 వ పీఠాధీశులై వీర సింహాసనము నలంకరించిన వారై ఇక్కడ (రంభాపురి బాళేహొన్నూరు)లో ప్రతి సం॥ము శ్రీ జగద్గురు రేణుకాచార్యులవారి జయంత్యుత్సవాన్ని పురస్కరించుకొని జాత్రా మహోత్సవములను అత్యంత వైభవోపేతముగా జరుపుచున్నారు. సద్యః శ్రీవారు ఈ పీఠముయొక్క శ్రేయోభివృద్ధికై పాటుపడుతు అనేక విద్యాసంస్థలను ప్రసాద నిలయములను గూడ నిర్వహించుచున్నారు.

1. శ్రీ జగద్గురు రేణుకాచార్య ఐ.టి.ఐ. కాలేజి, బాళేహొన్నూరు.

2. శ్రీ జగద్గురు రేణుకాచార్య ప్రౌఢశాల, ఉద్దేబోరనహళ్ళి, చిక్క మంగళూరు జిల్లా.

3. శ్రీ జగద్గురు రేణుకాచార్య గ్రామీణ విద్యాపీఠము, శిగ్గాంవి, ధారవాడ జిల్లా.

4. వేద సంస్కృత పాఠశాల, శ్రీ మద్రంభాపురీ మహాపీఠ బాళె హొన్నూరు మరియు శ్రీ జగద్గురు రేణుకాచార్య హైస్కూలు మరియు జూనియర్ కాలేజి, బాళెహొన్నూరు.

5. బీరూరు శివానందాశ్రమములో అభ్యాసము జేయుచున్న విద్యార్థులకు వసతి సౌకర్యము.

6. బెంగళూరులోనున్న మహాంతర మఠము గురు కులమును నిర్వహించు చున్నారు. అంతేగాకుండ బిరూరు కళ్యాణ మంటపమునకు లక్షాంతర నిధిని ఆశీర్వదించి మూలనివేశనము మరియు చిక్కమంగళూరు శ్రీ జగద్గురు రేణుకాచార్య కళ్యాణ మంటపమునకు 50 (ఏబది) లక్షల నిధిని మూల స్థలమునకై యుచితముగా నాశీర్వదించి, కల్యాణ మంటపాన్ని నిర్మించుటకు అవకాశమును గల్పించి యున్నారు. హుబ్బళ్ళి నగరములోను ఇంతలోనే ఒక కల్యాణమంటపము సిద్ధగింపబడుచున్నది. శ్రీవారి పీఠమువందు అతిథిగృహములు, శ్రీ జగద్గురు శివానంద ప్రసాద నిలయము ప్రాంగణమున మహా ద్వారమును, బాళెహొన్నూరు పేటలో (నగరమున) ప్రవేశ ద్వారమును మరియు చిక్కమంగళూరు నగరముయొక్క ప్రధాన మార్గములలో రంభాపురి మఠము నిర్మాణము మున్నగునవి నిర్మించుచున్నారు. ఇంకను అనేకములైన అభివృద్ధి కార్యములు వీరి కాలములో నెరవేరమున్నవి.

ఈ విధముగా ప్రాచీనమునుండి ప్రస్తుత వర్తమానకాలమువరకు శ్రీ పీఠముయొక్క పరంపరాభివృద్ధి గాంచుచున్నది.

---

# వీరశైవధర్మము పంచసంఖ్యాయుతమైనది

ముత్తయిదువలు :- వీరశైవ ధర్మమునందు ఐదవ సంఖ్యకు చాల మహత్వమున్నది. ప్రతి యొక్క శుభకార్యములోను ఐదుమంది ముత్తయిదువలు ఉండి మంగళ కార్యమును ప్రారంభింతురు. ఈ ముత్తయిదువులకు శ్రీ పంచాచార్యులు తమ ధ్వజములయొక్క రంగు (వర్ణము) లనే ముత్తయిదువుల చిహ్నములుగా నంగీకరించియున్నారు. ఆకుపచ్చని గాజులు జ॥ శ్రీ రేణుకాచార్యులవారి ధ్వజమునకు సంకేతము. కుంకుమ వర్ణము సద్ధర్మపీఠముయొక్క శ్రీ దారుకాచార్యులవారి ధ్వజమునకు సంకేతము. నల్లని పూసలు కేదారపీఠముయొక్క ఏకోరామారాధ్యులవారి (నీలిరంగుది) ధ్వజమునకు సంకేతము. తెల్లని కడెము (కంకణము) కాలి ఉంగరములు, శ్రీశైల సూర్య సింహాసనాధిపతులైన శ్రీ పండితారాధ్యులవారి (తెల్లది) ధ్వజమునకు సంకేతము. మంగళసూత్రము మరియు ముక్కుపోగులు శ్రీ కాశీ జ్ఞాన సింహాసనాధీశులైన శ్రీ విశ్వారాధ్యులవారి (పసుపురంగుది) ధ్వజమునకు సంకేతము.

ఇట్టి సుమంగళియైన వధువు వీరవృత్తిచేత భర్త గృహమును "మూడు పువ్వులారుకాయలుగా" వభివృద్ధిపరచి శాంతిమయము, సుఖమయమైన జీవితముగా పరిణమించాలని యెంచి, భర్త గృహమును ధర్మయుతముగా (పరిపూర్ణ ధర్మముతో) గరుపవలెనని, వధువు అత్త-మామల మరియు భర్తయొక్క సేవను అనన్యమైన భక్తి-శ్రద్ధలతోజేసి సమాన దృష్టిగలదై యుండి సూర్యుని తేజస్సువలె జీవించుగాక (మనుగడ సాగించుగాక) యనియు, యుక్తాయుక్త వివేకముగలదై, సుజ్ఞానముగలదై ప్రకాశించవలెననియు ఐహిక వస్తువుల వ్యామోహమునకు లోనుగాకుండ, వైరాగ్యశీలురాలై భర్తకొరకు ఎంతటి త్యాగమునకైన వెనుకంజవేయకుండ

ఉండి ఎల్లవేళలందును పతి సంక్షేమమునే గోరుచు అతనిని నీడవలె సుఖ దుఃఖాల్లోను అనుసరిస్తూ ఉండునట్టిదే వీరనారియనుట కర్తవ్యమైనదగు చున్నది. ఇట్టి యైదు విధములైన లక్షణములుగలిగి ప్రవర్తించు ముత్తయిదువులలో స్థిరముగా నిలువాలనే శ్రీ పంచాచార్యులు ముత్తయి దువతనమును అనుగ్రహించి యున్నారు.

## నిశ్చయ కారణము

వివాహ మహోత్సవమునకు ముందు నిశ్చయింపు కార్యము మొదట ఆచరించవలసినది. వధూ-వరులకు సంబంధించిన మాట ముచ్చటలు ముగిసినపిదప రెండు పక్షములవారంగీకారమునకు వచ్చినయెడల తరువాత నిశ్చయ కార్య సమారంభమునకై ఓ మంచి ముహూర్తమును తమ గురువులవారిచేత పరిశీలింపజేసి దానిని నెరవేర్తురు. ఈ నిశ్చయ కార్య మునకు బంధువర్గమువారు, ఆప్త పరిచితులు, స్నేహితులు మున్నగువారందరు విచ్చేయుదురు. ఈ కార్యములో ధార్మిక నియమాల ననుసరించి, ఇంటి యజమాని మఠాధికారిని, శెట్టిని, బణకారు, (భక్తుడు) పటేలు మఠపత్తి వీరందరికి (పంచులకు) ఆమంత్రణమును బంపుచు తోడ్కొనివచ్చును. వీరందరుఇంటికి విచ్చేసిన పిదప వీరి సమ్ముఖమునందే కారీకము మూటను విప్పుదురు. దానిని ప్రప్రథమముగా తాబాణమునందుంచి యీ యైదుమంది ధర్మపంచులకు క్రమముగా సమర్పింతురు. ఆ పిదట మిగత వారికి ఇత్తురు. అకస్మాత్తుగా నీ యైదుగురు పంచులలోనే ఒక్కరు రాక పోయినచో వారికిచ్చే బాపతు (హక్కు)ను వారికి మరెవరితోనైన అందజేసే వారు. ఈ పంచులకు సమర్పించే ఈ ప్రథమ గౌరవమునకు వీరశైవ పారిభాషికలో (బాబతు-హక్కు) అనే శబ్దము వాడుకలోనున్నది. ఈ పంచులు పీఠాధిపతుల ప్రతినిధులైయుంటచేతనే వీరి సమక్షమంలోనే వీరశైవులందరు తమ ప్రతియొక్క మంగళ కార్యమును నెరవేర్చుకొందురు.

## —: వీర శైవ గోత్ర సూత్రములను దెలుపు పటము :—

శ్లో॥ మత్పంచ వదనోద్భూతాః సర్వ ఏవ గురూత్తమాః తత్సృష్టానాంచ సర్వేషాం తత్సామర్థ్యం కథం భవేత్।
తస్మాత్పంచ విధాచార్యాః పంచ పీఠాధిదేవతాః పంచ సింహాసనాధీశా జగద్గురు వరాశ్చతే ॥

| | | |
|---|---|---|
| శ్రీ పరశివుని పంచ ముఖములు | సద్యోజాత | వామదేవ |
| శ్రీ పరశివుని పంచ వర్ణములు | ఆకుపచ్చ | ఎఱుపు |
| శ్రీ పరశివుని పంచ దిక్కులు | తూర్పు | దక్షిణము |
| శ్రీ పరశివుని పంచ ముఖముల నుండి బుట్టిన పంచ గణా | రేణుకా | దారుక |
| ధీశులు యుగభేదముల(బట్టి పంచ గణాధీశులు (కృతయుగమున) | ఏకాక్షర శివాచార్య | ద్వ్యక్షర శివాచార్య |
| త్రేతా యుగమున | ఏక వక్త్ర శివాచార్య | ద్వివక్త్ర శివాచార్య |
| ద్వాపర యుగమున | రేణుక శివాచార్య | దారుక శివాచార్య |
| కలియుగమున | రేవణారాధ్య | మరుళారాధ్య |

| | | |
|---|---|---|
| నాలుగు యుగములందును ఆచార్యులు ఉత్పత్తి స్థానములు మరియు నివాస స్థానములు | కొలనుపాక క్షేత్రమున సోమేశ్వర లింగము నుండి యుద్భవించిరి, రంభాపురి నివాసం. | వట క్షేత్రమున శ్రీ సిద్ధేశ్వర లింగమునుండి యుద్భవించిరి, ఉజ్జయిని నివాసము |
| పంచ గోత్రాధిపతుల పేర్లు | వీర | నంది |
| పంచ సూత్రముల పేర్లు | కామికాగమము పడ్విడి సూత్రము | దీప్తాగమము వృష్టి సూత్రము |

## పంచ మహా సూత్రములు :

| | | |
|---|---|---|
| పంచ శాఖల పేర్లు | రేణుక శాఖ | దారుకశాఖ |
| వేదముల పేర్లు | ఋగ్వేదము | యజుర్వేదము |
| పంచ ప్రవరములు | ఏకాక్షర శివాచార్య | ద్వ్యక్షర శివాచార్య |
| పంచ దండములు | అశ్వత్థము (రాగి) | పలాశ (మోదుగు) |
| పంచ కమండలములు | హరిద్వర్ణిమయ ధాతువు | తామ్రము |
| పంచ కంథలు (వస్త్రములు) | ఆకుపచ్చ వస్త్రము | ఎరుపు వస్త్రము |
| పంచ మంత్రములు | ప్రసాద పంచాక్షరి | మాయా పంచాక్షరి. |

* * *

## —:సూత్ర పటము:—

| | | |
|---|---|---|
| అఘోర | తత్పురుష | ఈశాన |
| నీలి | తెలుపు | పసుపు పచ్చ |
| పశ్చిమ | ఉత్తర | ఊర్ధ్వము |
| ఘంటాకర్ణ | ధేనుకర్ణ | విశ్వకర్ణ |
| త్ర్యక్షర శివాచార్య | చతురక్షర శివాచార్య | పంచాక్షర శివాచార్య |
| త్రివక్త్ర శివాచార్య | చతుర్వక్త్ర శివాచార్య | పంచవక్త్ర శివాచార్య |
| ఘంటాకర్ణ శివాచార్య | ధేనుకర్ణ శివాచార్య | విశ్వకర్ణ శివాచార్య |
| ఏకో రామారాధ్య | పండితారాధ్య | విశ్వారాధ్య |
| ద్రాక్షారామక్షేత్రమున శ్రీభీమేశ్వర జ్యోతిర్లింగము నుండి యుద్భవించిరి, హిమవత్కేదార నివాసము. | సుధాకుండ క్షేత్రమున శ్రీమల్లికార్జున జ్యోతిర్లింగము నుండి యుద్భవించిరి, శ్రీశైల నివాసము. | శ్రీ కాశీ క్షేత్రమున శ్రీవిశ్వనాథ జ్యోతిర్లింగము నుండి యుద్భవించిరి, కాశీ నివాస స్థానము. (జంగమ వాడి) |

| | | |
|---|---|---|
| భృంగి | వృషభ | స్కంద |
| విజయాగమము. లంబన | వాతులాగమము ముక్తాగుచ్ఛము | ప్రోద్గీతాగమము. పంచ వర్ణః |
| ఘంటాకర్ణశాఖ | ధేనుకర్ణశాఖ | విశ్వకర్ణశాఖ |
| సామవేదము | అథర్వణ వేదము | అజపవేదము (ఆగమము) |
| త్ర్యక్షర శివాచార్య | చతురక్షర శివాచార్య | పంచాక్షర శివాచార్య |
| వేణు (వెదురు) | న్యగ్రోధ (మఱ్ఱి) | బిల్వము |
| లోహము | కాంస్యము (కంచు) | సువర్ణము |
| నీలి వస్త్రము | తెల్లని వస్త్రము | పసుపురంగు వస్త్రము |
| సూక్ష్మ పంచాక్షరి | స్థూల పంచాక్షరి. | మూల పంచాక్షరి. |

వీరశైవాగమ తంత్రాదుల ప్రకారము పరిశోధించి యీ పటమును సిద్ధగించనైనది. కావున సమస్త వీరశైవులు పై పట్టికలో వివరింపఁబడిన విధముగ ఆయా ఆచార్యుల గోత్ర సూత్రములకు సంబంధించిన వారా యాయా గోత్ర సూత్రములనే శుభాశుభ కార్యములందు పేర్కొనవలెనని మా కోరిక.



# అ ము ద్రి త ము లు

1. శివానుభవ వ్యాస సంపుటి. భా 1-2.
2. వీరశైవ గత వైభవము.
3. స్వీయ చరిత్ర (గ్రంధకర్తది)
4. విరాగి (నవల)
5. దారిద్ర్య పెనుభూతము (నాటకము)
6. ఆదర్శపు వివాహము (నాటకము)
7. జగజ్జ్యోతి బసవన్న (నాటకము)
8. బసవ గాంధి తత్వసామ్యము.
9. శాంత (నాటిక)
10. ఆదర్శపు విద్యార్థులు (నాటిక)
11. పోలీసు దద్దమ్మ (చిన్న నాటిక)
12. జగద్గురు శ్రీ రేణుకాచార్యులు (నాటిక)
13. అద్భుత ప్రేమ అందని తేమ (కథానిక)
14. వీరశైవ ధార్మిక వ్యాసములు.

ఇంకను ననేక వ్యాసములను ధార్మిక-సాంఘిక-సాహిత్యక-సాంస్కృతికములకు సంబంధించినవి, కన్నడ-తెలుగు-సంస్కృతములలో అనేక పత్రికల ద్వారా ప్రకటించడమైనది. మరియు ఆలిండియా రేడియో (ఆకాశవాణి) ద్వారా సిద్ధాంత శిఖామణి, శివ శరణులు, సంఘ సంస్కర్త శ్రీ బసవన్న అను ప్రసంగములను అమరవాణి, సంస్కృతములోను కన్నడ తెలుగులోను ప్రకటించనైనది. "వీరశైవధర్మ" అను పత్రికను తెలుగులో ధర్మ ప్రచారమునకై నిరర్గళముగా వరుసగా పది సం॥ములు నిర్వహించబడినది.

## ముద్రిత గ్రంథములు :-

1. వీరశైవధర్మ భావగీతికలు (నూతన ఫక్కిలో, తెలుగు, కన్నడ, హిందీ, సంస్కృతములలో నున్నవి) రూ. 15-00
*2. శ్రీ బసవేశ్వరతత్త్వములు (సంపాదకీయ వ్యాసాలు) రూ. 5-00
*3. వీరశైవ ధర్మాన్వేషణము (కన్నడకు తెనుగుసేత) రూ. 3-00
4. నేనెవరు ? (వీరశైవ సమాజోద్యమము జి. మెదకు). రూ. 3-00
5. రత్నత్రయము, (నీతిబోధక వ్యాసములు) రూ. 5-00
*6. మహాజ్ఞాని చన్నబసవన్న (కన్నడకు తెనుగుసేత) రూ. 0-50
7. అల్లమప్రభు విజయము (నాటిక)
8. వీరవిరాగిణి అక్కమహాదేవి (నాటిక) } రూ. 15-00
9. ప్రతిజ్ఞా పూర్తి (నాటిక)
10. షష్టిపూర్తి విశేష సంచికలో శ్రీ బసవేశ్వర కన్నడ వచనాలకు తెనుగుసేత, సూక్తిసుధా, సంస్కృత శ్లోకములకు తెలుగుసేత రూ. 15-00
11. ఇష్టలింగార్చనావిధిః, (అర్చక పరీక్షార్థులకొరకు వ్రాసినది) రూ. 5-00
12. శ్రీ రేణుకాచార్య జయంత్యుత్సవ సందర్భమున శ్రీ స్వామి వీరభద్ర శివాచార్య మహాస్వాములవారి కన్నడకు తెలుగుసేత రూ. 0-50
13. జ॥ శ్రీ రేణుకాచార్యుల చరితామృతము (వచనకావ్యము) రూ. 20-00
14. ప్రాచీన వీరశైవము రూ. 20-00
15. వీరశైవులాచరింపదగిన సూచనలు రూ. 0-50
16. వీరశైవ గోత్ర సూత్ర పటము రూ. 1-00



# ఆంధ్రప్రదేశ వీరమాహేశ్వర (జంగమ) మహాసభ, హైదరాబాదు (ఆం. ప్ర.)

ఈ సభ స్థాపనకు లక్ష్యము, ఇంతవరకు సభకొనర్చినసేవ :-

ఆంధ్రప్రదేశ వీర మాహేశ్వర (జంగమ) మహాసభను 1976 సం॥ములో కేవలము ఈ ఉద్దేశముతో స్థాపించనైనది. ఆంధ్రప్రదేశములోని వీర మాహేశ్వరుల (జంగముల) దీనస్థితిని సుధారించుటకై మరియు వారి యోగక్షేమములను గురించి పరామర్శించి యథాశక్తి సేవ యొనర్చుట మరియు వారిలో ఐక్యతను నెలకొల్పి వారి కల్యాణమునకై వారి కష్ట నిష్కారములను భారత ప్రభుత్వమునకుగాని లేదా ఆంధ్రప్రదేశ ప్రభుత్వము నకు గాని ప్రతినిధులద్వారా శృతపరచుటే ముఖ్య కారణమై యున్నది.

ప్రప్రథమున శ్రీమాన్ గౌరవనీయులైన శ్రీ బి.డి. జట్టి గారు తాత్కాలిక (Acting president of India) భారత దేశమునకు ప్రెసిడెంటుగా నున్నప్పుడు "వీర మహేశ్వరు (జంగము) లను వెనుకబడిన తరగతిలో (జాబితాలో) జేర్పించవలెనని తేది 26-7-77 లో ఒక వినతి పత్రమును (Memorandam) సమర్పించిన ఫలితముగా వీరమాహేశ్వరు (జంగము) లను బి పి. A గ్రూపు లో జేర్చబడమైనది దీని ఫలితముగా నాటి నుండి నేటి వరకు వేల సంఖ్యలో మనవారు ప్రభుత్వము నుండి లాభమును బొందియున్నారు. నేటికిని బొందుచున్నారు.

1982 సం॥లో ఆంధ్రప్రదేశ ప్రభుత్వము నుండి ఈ సంస్థను రిజిస్ట్రేషన్ జేయించనైనది. రిజిష్టర్ సంఖ్య 787/1982 Act, 1350 ఫసలి (Act I of 1350 F) మార్చి నెల 1982.

ఈ ఆం.ప్ర. వీరమాహేశ్వర (జంగమ) మహాసభకు గౌరవా ధ్యక్షులుగా జగద్గురు 1008 కాశీపీఠము యొక్క జ్ఞాన సింహాసనా ధీశులైన లిం॥ శ్రీ శ్రీ శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు జంగమవాడి మఠము వారాణసి గారు.

అధ్యక్షులు :- పండిత, పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" M.O.L.

ఉప. అధ్యక్షులు :- పం॥ చన్నబసవయ్యస్వామి హిరేమఠ, M.A.
తాండూరు.

ప్రధాన కార్యదర్శి :- సి. ఆనందరావు, M.B.B.S.

సహాయ కార్యదర్శి :- యం. శంకరయ్య, M A. & M.O.L.
ఇబ్రాహింపట్టణము.

కోశాధ్యక్షులు :- బి.యం.యస్. వీరభద్రయ్య B.A., B.Ed.,
కామారెడ్డి.

కార్యవర్గసభ్యులు :-

Dr. R.M. వీరభద్రయ్య, ( R M P )

మహంతు మఠము సిద్ధలింగస్వామి

మఠము మహాంతయ్య స్వామి, శంషాబాదు

మడుపతి చంద్రమౌళి, మలక్‌పేట్, హైద్రాబాదు.

1) ఈ విధముగా ఎన్నుకొనబడినారు. ఈ సభకు అనుబంధ శాఖలుగా వరంగల్లు, కరీంనగరు, మెదక్ జిల్లా జోగిపేట వెలకొల్పబడినవి.

దీనినాదర్శముగా నిడుకొని కర్నాటకములోను, ధారవాడ, హుబళ్ళి, గదగ మున్నగు నగరాలలో బొంబాయివంటి మహారాష్ట్రలలోను ఈ సభలు నెలకొన్నవి.

2) ప్రతి యేట శ్రీ బసవేశ్వర జయంతితోబాటు జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి జయంత్యుత్సవాన్ని జరుపడము జరుగుచున్నది.

3) వీర మాహేశ్వర విద్యార్థులకు ప్రభుత్వమునుండి ఉచిత భోజన వసతి గృహమును నగరములో నెలకొల్పాలని ఆంధ్రప్రదేశ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖాధికారులతో పత్ర వ్యవహారములను జరుపడమైనది. ఎండోమెంటు వారికి గూడ వ్రాయనైనది. అధికారులకు పత్రములు వ్రాయడమే గాకుండ సమక్షమంలో గల్పి సుదీర్ఘముగా సంప్రదించడమైనది.

Ref. Endt. No. 857/P2/B6-1 ది 11-8-1986 మరియు సాంఘిక సంక్షేమ శాఖాధికారి పత్రసంఖ్య L. Dis. No. D2/6689/86. ది. 29-3-1988 మరియు Endt. No. 857/P2/86-1. తేది 11-8-1986. ఈ విషయమై అప్పటి ముఖ్యమంత్రిగారైన శ్రీ N.T. రామారావుగారితో గల్పి మనవిజేయనైనది.

4) వీర మాహేశ్వరుల జీవిత భృతి కొరకు ఆం.ప్ర. ప్రభుత్వ దేవాదాయ-ధర్మాదాయ ఉన్నతాధికారితో గల్పి వీరశైవాగమ పండిత అర్చక పరీక్షార్థులకు తెలుగులో పాఠ్యపుస్తకములను వీర్పరచవలెనని యనేకసార్లు నేనా బోర్డు మెంబరునైయుండిగూడ మనవి జేయడము జరిగినది. ఈ విషయమై ఆంధ్రప్రదేశ

వీరశైవ మహాసభ వారికి విన్నవించినను వారుగూడ అంతగా పట్టించుకొనలేదు.

5) వీరమాహేశ్వర విద్యార్థులకు ధార్మిక శిక్షణకై హైదరాబాదులోగాని లేదా సికిందరాబాదులోగాని ఒక ధార్మిక పాఠశాలనుగాని అథవా ఒక ధార్మిక కళాశాలనుగాని నెలకొల్పినచో దానికి కొంత నిధిని మేము మా సభనుండి సమకూర్చగలమని ఎండోమెంటు కమీషనర్ హైద్రాబాదు గారికి నివేదించుకోవడము జరిగినది. అయినను వారుగూడ అంతగా శ్రద్ధ దీసికోవడములేదు.

6) వీరశైవ మహాసభ పక్షమున వీరశైవ ధర్మప్రచారమును యేయే కార్యక్రమములు జరుపబడుచున్నవో వారి యాహ్వానముపై వెళ్ళి వాటిలో పాల్గొని ధార్మికోపన్యాసముల ద్వారా వారిని చైతన్య వంతులుగా జేయడము జరుగుచున్నది. అంతేగాకుండ వ్యష్టిగతము గానిసమిష్టిగతముగాగాని (ది.20-4-1984 షష్టిపూర్త్యుత్సవము. 63 మంది పురాతనుల పూజలు ది. 25-5-1987 వంటివి) జరిపి, ఈ సందర్భమున జగద్గురువులను, మహా పండితులను, మహా స్వాములను రప్పించి వారి ద్వారా అప్పుడప్పుడు ధర్మ ప్రచారమునకై ధార్మికోపన్యాసముల నిప్పించడము జరుగుచున్నది. ఈ విధముగా వీరశైవ సాహిత్య-సాంఘిక-సామాజికము మరియు ధార్మిక కార్యకలాపములతో వీరశైవ ధర్మ సముద్ధరణమునకై నిరంతరము ఈ సభ పాటుబడుచున్నది. పత్రికను అనేక ధార్మిక గ్రంథములను ముద్రించి వీరశైవుల కందజేయుచున్నది. ఇంకను వీరశైవ సమాజమువారు తను - మన - ధనములతో సహాకరించినచో ఎంతగానో సేవజేయవలెనని కోరిక యున్నది.

---

# వీర మాహేశ్వరు (జంగము) లకు ఒక మనవి

ఆంధ్రప్రదేశమున నున్న వీర మాహేశ్వరులందరు సమైక్యతతో నుండి మానవ సమాజములో తమ గౌరవ ప్రతిష్ఠలను నిలబెట్టుకొనుటకై మంచి ఆచార విచారములు నలవరచుకొని ప్రతి దినము శుద్ధ స్నానము, మడి వస్త్రధారణము, నుదుట భస్మము, మెడలో లింగము, రుద్రాక్షలు ధరించి ఇష్టలింగార్చన - నిత్య పారాయణము, గురు జంగము (మహాస్వాము)ల దర్శనము, వారి ద్వారా శివానుభవ గోష్ఠి నెరపుట, వారి ఉపదేశములనాలకించుట, వీరశైవ ధర్మగ్రంథములను శ్రద్ధతో జదువుట అందులో ముఖ్యముగా వీరశైవులకు మూల గ్రంథమైన "సిద్ధాంత శిఖామణి శ్రీ బసవేశ్వర వచనములు, శివగీతా, శతకత్రయము" వంటి మహా గ్రంథములను క్షుణ్ణముగా జదివి వాటి సారమును గ్రహించుట యెంతేని అవసరము, అంతేగాదు ఆయినంతమట్టుకు అందులోని విచారములను ఆచరణలో బెట్టుటకు యత్నించవలెను.

వీరశైవ సమాజమును సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దవలెనని మొదలు వీర మాహేశ్వరులు ఆదర్శప్రాయముగా కావలెను. ఆ లక్ష్యముతో ఏ వీర మాహేశ్వర (జంగమ) మహాసభ ప్రదేశములో మొట్టమొదటిసారిగా నెలకొల్పడము జరిగినది. కావున దయచేసి వీర మాహేశ్వరు (జంగము) లందరేకముకండి. దినదినము క్షీణించుచుండిన వీరశైవ ధర్మమును పునరుద్ధరించుటకై నేడే సంసిద్ధులుకండి. సమాజ సేవ యొనర్చుటకు ఇట్టి సువర్ణావకాశము మరల దొరకదని భావించగలరు.

ఇట్లు

జంగమాభిమానులు

Sudarshan Printers, Hyderabad.